వెల కట్టలేని
మీ ఆనందానికి
15 రూపాయలు
ఓ లెక్కేనంటారా?

స్వచ్ఛమైన చిరునవ్వుకి... అచ్చమైన చిరునామా...

# హాస్యానందం

సంపూర్ణ హాస్య మాస పత్రిక

ఫిబ్రవరి-2014 ₹15/-





మళ్ళ జగనాథం స్మారక
తెలుగు స్కిట్ పోటీల ఫలితాలు

# 25

## Silver Jubilee Greetings

హాస్యానందానికి అత్యంత ఆప్తులు

**శ్రీ ఎమ్.వి.జె.భువనేశ్వరరావు, ధనలక్ష్మిల** దాంపత్యం

నిత్యనూతనంగా ఉంటూ... నిండు నూరేళ్ళు సుఖ సంతోషాలతో వర్ధిల్లాలని...

**వివాహ రజతోత్సవ శుభాకాంక్షలు!**



స్వచ్ఛమైన చిరునవ్వుకి... అచ్ఛమైన చిరునామా...




సంపూర్ణహాస్య మాస పత్రిక

ఫిబ్రవరి-2014 ✦ సంపుటి-10 ✦ సంచిక-10

| | | |
|---|---|---|
| Publisher&Editor | : | Ramu.P |
| Chief Artist | : | A.Dayakar |
| Cartoon Editor | : | A.V.M |
| Full Pillar | : | Bnim |
| Abroad Promoter | : | V. Pavan Kumar, USA |
| Well Wishers | : | Tanikella Bharani<br>Jaydev<br>Mallik<br>Dr.Sudarsanam<br>Sanku |
| Designing | : | Creative Graphix |
| Creative Team | : | Tumbali Sivaji<br>T.Chandra Sekhar<br>Rampa<br>P.V.Narayana<br>Ramsheshu<br>Mallikarjun.U |
| Address | : | HASYANANDAM,<br>#8-215/4,<br>Near Ramalayam,<br>Po:YERRABALEM<br>Pin 522 503,<br>Mangalagiri Mandal,<br>Guntur dist. |
| Ph | : | 9849630637 |

email: hasyanandam @yahoo.com

Hyderabad & Secunderabad Distributors:



**Charminar News Agencies,**
1-6-176/1, M.G.Road,
Khandoji Bazar, **Secunderabad-3.**
Ph:9346515813
J.N.Road, Abids, **Hyderabad.**
Ph:040-30720007



# హాయ్... సానందంగా...

హాస్యానందం అభిమానులకు... ఆప్తులకు... సన్నిహితులకు **హాస్యాభివందనాలు!**

ఎంత అందమైన... ఆనందమైన జీవితాలు మనవి... ప్రేమించే స్నేహితులు... అభిమానించే ఆత్మీయులు... ఆదరించే బంధువులు... వీరందరి మధ్యన బ్రతుకుతున్నాం మనం!... పాజిటివ్ ఫీలింగ్స్ ఇవి.

మనం అలా ఫీలౌతున్నామా?... ఒక్కక్షణం ఆలోచిద్దాం!

ఎవరైనా 'ఏం బ్రతుకో...' అనుకుంటూ ఉసూరు మంటూ కాలంవెళ్ళబుచ్చుతున్నారంటే సమస్య ఎక్కడుందో ఒకసారి చెక్ చేసుకోవాలి! దానికి పరిష్కారమార్గం కనిపెట్టాలి. సమస్యలనేవి అందరికీ ఉంటాయి... కొందరికి ఆర్థిక సమస్యలైతే... మరికొందరికి ఆరోగ్య సమస్యలు... ఇంకొంత మందికి పిల్లల వలన (పుట్టకపోవడం...తరువాత మాట వినకపోవడం) సమస్యలు... ఇవన్ని మనం మన భావాలను ఒక చట్రంలో బిగించడం వలన ఎర్పడ్డవే! ఒక్కక్షణం మన భావాలను మార్చుకుంటూ రెండవ వైపు నుంచి ఆలోచిస్తే కచ్చితంగా ఒక పరిష్కారమార్గం కనబడుతుంది. సమస్యని ఆప్తులతో పంచుకుని వాళ్ళ సలహాలు కూడా తీసుకుంటే మంచి జరగుతుందనేది సత్యం.

ఏ సమస్య అయినా మన చేయి దాటి ఉండదు. కావలసిన దల్లా ప్రశాంతంగా ఆలోచించడమే.

అదే కరువై పోయిందీనాడు.

ఆరోగ్యకరమైన ఆలోచనలతో మన చుట్టూ ఒక ప్రశాంతమైన వాతావరణం సృష్టించుకుంటే ఆ 'సేఫ్'జోన్ మనల్ని ఆరోగ్యవంతులుగా... మంచి ఆలోచనలు చేసే మనుషులుగా మలుస్తుంది.

అందరూ ఆరోగ్యంగా...ఆనందంగా...ఉండాలని కోరుకుంటూ...

-రాము.పి
(ఎడిటర్)










## కార్టూన్లు



## ఎక్కడ ఏ నవ్వులున్నాయో....



ఈ సంచికలో **మాటలాట** రచయిత-

**కొనె నాగ వెంకట ఆంజనేయులుగారు**

## మన జనాలు ..హరగోపాల్...



# 20,000 రూపాయల బహుమతులు

# శ్రీ తలిశెట్టి రామారావు స్మారక కార్టూన్ పోటీలు 2014



తొలి తెలుగు కార్టూనిస్ట్
**శ్రీ తలిశెట్టిరామారావు జయంతి**
సందర్భంగా హాస్యానందం నిర్వహిస్తున్న
ఈ కార్టూన్ పోటీలో మన కార్టూనిస్ట్‌లు పాల్గొని
విజయవంతం చేయాలని కోరుతూ...

| | |
|---|---|
| మొదటి బహుమతి | రూ. 5000/- |
| రెండవ బహుమతి | రూ. 3000/- |
| మూడవ బహుమతి | రూ. 2000/- |
| కన్సోలేషన్ బహుమతులు (20) | రూ.500/- |

**కార్టూన్లు మాకు చేరవలసిన ఆఖరి తేదీ**
**10, ఏప్రియల్ 2014**



శ్రీసత్యనారాయణగారి సౌజన్యంతో

# క్వైట్ ఫన్!

## ఫిబ్రవరి విజేతలు

ఈ శీర్షికలో పాల్గొన్న కార్టూనిస్ట్ అందరికీ అభినందనలు! మన తెలుగు కార్టూనిస్టులు 'క్యాప్షన్‌లెస్ కార్టూన్ల'లో అగ్రగామీలవ్వాలనే సదుద్దేశంతో మొదలయినదీ వేదిక! మరిన్ని మంచి మంచి కార్టూన్లు వేయడానికి ఈ 'క్వైట్‌ఫన్' స్ఫూర్తినివ్వాలని మా ఆకాంక్ష! -ఎడిటర్




మొదటి బహుమతి రూ.500/-లు పొందిన కార్టూన్

రెండవ బహుమతి రూ.300/-లు పొందిన కార్టూన్




మూడవ బహుమతి రూ.200/-లు పొందిన కార్టూన్




హాస్యానందంలో

**క్యాప్షన్‌లెస్ కార్టూన్‌లకు ప్రతినెలా బహుమతులు**

ప్రతీ నెలా 15వ తేదీలోగా మీ కార్టూన్లు మాకు చేరేలా పంపించండి!

మొదటి బహుమతి- **రూ.500/-లు**

రెండవ బహుమతి- **రూ.300/-లు**

మూడవ బహుమతి- **రూ.200/-లు**

మీ కార్టూన్లు ఈ మెయిల్ కి మెయిల్ కూడా చేయవచ్చు-quitefun.hasyanandam@gmail.com

యండమూరి వీరేంద్రనాథ్



# పలుకే ప్లాటినమాయెరా

**ఒక విషయాన్ని అవతలివారికి చెప్పేటప్పుడు, అది వారికి సరిగ్గాఅర్థం అయిందా లేదా అని చూడాలి.**

**ఒక దిన పత్రికలో "నక్సలైట్లు పోలీసు స్టేషన్ చుట్టు ముట్టి, కాల్పులు జరిపినప్పుడు పోలీసులు కూడా ఎదురు కాల్పులు జరిపారు. ఇందులో ఆరుగురు గాయపడ్డారు" అని వార్త వచ్చింది.**

**గాయపడింది పోలీసులో, నక్సలైట్లో చదివేవారికి అర్థం కాలేదు.**

"నీ భార్య చనిపోయిందని తెలిసి చాలా సంతోషంగా ఉంది" అన్నాడు ఓ స్నేహితుడు.

అసలే భార్య మరణించి రోదిస్తున్న వ్యక్తి ఈ మాటలకి నిర్ఘాంతపోయాడు.

"నీకు క్యాన్సర్ అని డాక్టర్లు నిర్ధారించారట" స్నేహితుడు కొనసాగించాడు... "ఇంకో నాలుగైదు నెలల కన్నా బ్రతకవని చెప్పారట. నిజమేనా?... పిల్లలు కూడా లేరు కదా! ఎంతో సంతోషంగా ఉంది."

వింటున్న వ్యక్తి సాచి పెట్టి కొట్టాడు.

మన ఫీలింగ్‌ని అవతల వారికి కరక్ట్‌గా అర్థమయ్యేలా చెప్పగలగటం ఒక కళ.

దీన్నే 'కమ్యూనికేషన్' అంటారు.

పై సంఘటనలో స్నేహితుని ఉద్దేశ్యమేమిటంటే... "నీవు ఇంకో ఆరునెలల్లో మరణించ బోతున్నావు. నీకెలాగో పిల్లల్లేరు. ఇప్పుడు నీ భార్యకూడా మరణించింది. ఆ విధంగా నీకు అన్ని భవబంధాలూ నశించాయి. నీ భార్య ఎంతో అదృష్టం చేసుకుంది కాబట్టే, నీ అంతిమ దినాల్లో కష్టాలు చూడకుండా... నీ మరణం తరువాత కష్టాల్ని భరించకుండా, ఈ లోకం నుండి వెళ్ళిపోయింది."

ఇది సరిగ్గా చెప్పలేకే అతడు ఒక స్నేహాన్ని పోగొట్టుకున్నాడు.

'మాట్లాడటం సిల్వర్!... మౌనం బంగారం' అన్న ఇంగ్లీషు సామెత కరెక్టయితే అయ్యుండవచ్చు గాక. దీనికన్నా మించిన సూక్తి –"సరైన సందర్భంలో సరిగ్గా మాట్లాడటం ప్లాటినం!"

మధురం మంచి సంభాషణా చాతుర్యం...

ఒక న్యూరోసర్జన్ మూడేళ్ళ పాపకి ఆరు గంటలపాటు అత్యంత క్లిష్టమైన మెదడు ఆపరేషన్ చేసి వస్తూంటే, బయట నిలబడ్డ తల్లిదండ్రులు ఎలా ఉందని ఆత్రంగా అడిగారు.

అలసటతో పాటు మొహంలో విజయగర్వం

మాట్లాడటం
నేర్పబడును

తొంగి చూస్తుండగా– "చాలా కాంప్లికేటెడ్ సర్జరీ! ఆపరేషన్ సక్సెస్! మీ అబ్బాయి తొందరలోనే కోలుకుంటాడు" అన్నాడు సర్జన్.

"అబ్బాయి కాదు. అమ్మాయి! అమ్మాయి!!" షాక్ తగిలినట్టు తల్లిదండ్రులు భయంగా అరిచారు.

మరో క్లిష్టమైన ఆపరేషన్‌కి వెళ్ళే ముందు కాఫీ తాగటం కోసం వేగంగా హడావిడిగా కేంటీన్ వైపు నడుస్తూ–

"ఓహ్! అమ్మాయి కదూ... అవును అమ్మాయి! రేర్ కేస్. మొత్తం అంతా వీడియో తీశాము. మా స్టూడెంట్స్‌కి బాగా ఉపయోగపడుతుంది. మీ అమ్మాయిని పది రోజుల్లో డిశ్చార్జి చేస్తారు" అన్నాడు.




ఆ డాక్టరు అద్భుతమైన సర్జన్. అందులో ఏ మాత్రం సందేహం లేదు. కానీ అతడు వృత్తికి సంబంధించిన వాడు... పేషెంట్స్‌కి కాదు! వృత్తిపట్ల వున్న పాషన్, ఇతరుల భావోద్వేగాలపట్ల అతడికి లేదు.

మాట్లాడటం ఒక కళ. వినటం ఇంకా పెద్ద కళ. అవతలవారు చెప్పేది శ్రద్ధగా వింటున్నట్టు అవతలివారు గమనించేలా వినాలి.

చెత్త మాట్లాడటం, అంతకన్నా మంచి(?) చెత్త వినటం రెండూ ఆనందాన్ని ఇస్తాయి.

రాంబాబు మహేష్‌బాబు ఫ్యాన్. ఆ హీరో సినిమా చూసొచ్చి రాత్రి పదింటికి సోంబాబుకి ఫోన్ చేసాడు. సోంబాబు ప్రభాస్ ఫ్యాన్. అయినా కథ మొత్తం విన్నాడు.

ఎందుకు? రాంబాబు తన స్నేహితుడు కాబట్టి!... వినటం ఆనందం కాబట్టి!... కథ పూర్తయ్యేసరికి రాత్రి పన్నెండయింది. మరుసటి రోజు సోంబాబు ప్రభాస్ సినిమా చూసి వచ్చి స్నేహితుడికి ఫోన్ చేసి కథ చెప్పాడు.

రాత్రి మళ్ళీ ఒంటిగంట అయింది.

ఇద్దరూ ఒకరి టైమ్ ఒకరు ఆరు గంటలు వేస్ట్ చేసుకున్నారు.

ఇదే సంభాషణ ఇంకోలా ఊహిద్దాం.

రాంబాబు స్నేహితుడికి ఫోన్ చేసి "నాకొక లెఖ్ఖ రావటం లేదు. కాస్త చేసి చెప్పు!" అని చెప్పటం ప్రారంభించాడు.

"ప్రభాస్ ఒక బ్రిడ్జి మీద వున్నాడు. బ్యాగు నీటిలో పడి ప్రవాహంలో తేలుకుంటూ వెళ్ళిపోయింది. ప్రవాహవేగం గంటకి 5 మైళ్ళు. మిత్రుడు మహేష్‌బాబుకి ఫోన్ చేసాడు. సరిగ్గా అరగంట తరువాత అతను వచ్చాడు.

"నాకు ఈత రాదు. కాస్త నా బ్యాగ్ తెచ్చి పెట్టు" అని స్నేహితుడిని కోరాడు ప్రభాస్.

మహేష్ నీళ్ళల్లో దూకి గంటకి పది మైళ్ళ వేగంతో ఈదుకుంటూ వెళ్ళి పర్సు తెచ్చిచ్చాడు. దానికి ఎంతసేపు పట్టింది? ఇదీ లెఖ్ఖ?" అని అడిగాడు.

ఇది కూడా బాగానే ఉంది కదా. ఇక్కడ ఉద్దేశం ఎప్పుడూ చదువే అని కాదు. ఇలా కూడా టైం పాస్ చెయవచ్చు కదా అని?! దీనివల్ల చదువులో ఉండే ఆనందం తెలుస్తుంది. బుద్ధి వికసిస్తుంది.




ట్రైన్లో ఒక ప్రయాణికురాలు "మీ వారేం చేస్తూంటారు?" అని ఎదురుగా కూర్చున్నామెని అడిగింది.

"ప్రొద్దున్నే లేచి బ్రష్ చేసుకుంటారు... స్నానం చేసి డ్రస్ వేసుకొని బ్రేక్ఫాస్ట్ చేసి ఆఫీసుకి వెళ్తారు... ఆఫీసు నుంచి వచ్చాక కొంచెం సేపు టీ.వీ చూసి భోజనం చేస్తాము. తరువాత బెడ్రూంలోకి వెళ్తాము" అందామె.

ఎదురుగా ఉన్న ఆవిడ బిత్తరపోయి–

"ఇదంతా నాకెందుకు చెప్తున్నారు" అంది.

"మావారేం చేస్తూంటారని మీరేగా అడిగారు" అన్నది ప్రయాణికురాలు.

"అవన్నీ నాకెందుకు?... ఆయన వృత్తి తెలుసుకుందామని అడిగానంతే" నిష్టూరంగా అన్నది ఎదురామె.

"అది మాత్రం ఎందుకు?" అని ఎదురు ప్రశ్న వేసింది ఆ ప్రయాణికురాలు.

# మల్లిక్కామెడీ కథలు

## సోది రాయుళ్ళు

**సో**మశేఖరం చాలా హడావిడి పడిపోతున్నాడు. ఇంట్లోనే అటూ ఇటూ పరుగులు పెడ్తున్నాడు.

అతన్ని చూసి వాళ్ళావిడ రత్నాబాయ్ కెవ్వుమని అరిచింది.

హడావిడిగా అటూ ఇటూ పరుగులు తీస్తున్నవాడు కాస్తా ఆ అరుపుకి ఠకీమని ఆగిపోయాడు.

"ఏమైంది?.. ఎందుకలా అరిచావ్?..." కంగారుగా అడిగాడు సోమశేఖరం.

"చెప్పండి... బుగ్గమీద ఆ కుంకుమ ఎలా వచ్చింది?... ఎవత్తి దగ్గరికెళ్ళొచ్చారు?... చెప్పండి!...చెప్పండి!!...చెప్పండి!!!..." చిందులేసింది రత్నాబాయ్.

సోమశేఖరం ఆశ్చర్యంగా భార్యవంక చూశాడు.

"కుంకుమా?.. నా బుగ్గమీదా?... ఎలా వస్తుంది?"

"ఎలా వస్తుందని నంగనాచిలా నన్నే అడుగుతున్నారా??.. చెప్పండి... ఎవర్తది?" మళ్ళీ చిందులు వేసింది రత్నాబాయ్.

"నువ్వు అలా దుంకడం కాస్త ఆపుతావా?... లేకపోతే కింద పోర్షనువాళ్లొచ్చి పీకుచ్చుకుంటారు ఏంటీగోలని... పొద్దున్న లేచిం దగ్గర్నుండీ యింట్లోనే ఉన్నావ్! నేనెక్కడికి వెళ్తాను?..." కోపంగా అరిచాడు సోమశేఖరం.

"మీరు అలా అరిస్తే నేను తగ్గిపోతాననా?... హమ్మా!... నేను వంటగదిలో నా పన్లో నేనున్నప్పుడు ఓ అరగంటలో అలా వెళ్ళి ఉండొచ్చుగా?...ఆహా!!... నాకు తెలీదా? చెప్పండి... ఎవర్తది? చెప్పకపోతే కింది పోర్షనువాళ్ళు రావడం కాదు... నేనే మీ పీకుచ్చుకుంటాను."

"ఏంటో... నాకంతా కన్ఫ్యూజన్‌గా ఉంది. ఓ మారిలా అద్దం తే..." అన్నాడు సోమశేఖరం బుర్రగోక్కుంటూ.

రత్నాబాయ్ అద్దం తీస్కొచ్చి సోమశేఖరానికి ఇచ్చింది.

అద్దంలో మొహం చూస్కుని సోమశేఖరం "కెవ్వు... కెవ్వు... కెవ్వు..." అని మూడుసార్లు అరిచాడు.

"ఎందుకలా అరిచావ్ అని నన్నడిగి మీరెందుకలా అరిచారు?... చెప్పండి ఎవర్తది?"

"గుర్ర్... గురగుర... గరగర... బుస్..."

"మాట్లాడకుండా గుర్రు గుర్రు... బుస్... అంటారేం?"

సోమశేఖరం రత్నాబాయ్ చేతుల్ని విదిలించికొట్టి విసుక్కుంటూ అన్నాడు.

"నా పీక పట్టుకుని నులిమేస్తూ మాట్లాడమంటే ఎలా మాట్లాడను?... అది నువ్వనుకుంటున్నట్టు కుంకుమేంకాదు... కంగారుగా గడ్డం గీస్కుంటుంటే బుగ్గమీద చెక్కులేచిపోయింది... చూడు రక్తం..." చూపుడు వేల్తో చెక్కుకుపోయిన చోట చూపిస్తూ అన్నాడు సోమశేఖరం.

"అయినా పెళ్ళి ముహూర్తానికి ఇంకా చాలా టైముందికదా??... అంత కంగారెందుకూ?"

"సరిగ్గా టైముకి వెళ్లమంటావా?... భలే దానివే... కనీసం రెండు గంటల ముందన్నా వెళ్ళాలి... అక్కడ పెళ్ళి పనుల్లో సాయం చేయాలి.భోజనాల దగ్గర వడ్డనలు చేయాలి!... ఎన్నిపన్లు! ఎన్ని పన్లు!!..."

"అవన్నీ మీరు చెయ్యడం ఎందుకూ? ఆయనేమైనా మీకు చుట్టమా స్నేహితుడా?"

"చుట్టం కాకపోతే... ఆయనెవరు?... మా జనరల్ మేనేజర్. తెల్సా?... ఇప్పుడు పెళ్ళి ఆయన కొడుకుదే... పెళ్ళికి పన్లు చేయకుండా సరిగ్గా ముహూర్తం టైంకి వెళ్ళి భోజనాలు చేసొస్తే ఆయనకి కోపంరాదూ?... అసలే నా పేరు ప్రమోషన్ లిస్టులో ఉంది. రేపొద్దున్న ఇంటర్వ్యూలో నన్ను ఫెయిల్ చేసినా చేసెయ్యొచ్చు..." అని చెప్పి గోడ గడియారం వంక చూసి కెవ్వుమని అరిచి-

"టైమైపోయింది... స్నానానికి వేణ్ణీళ్ళు పెట్టెయ్..." అన్నాడు.

"ఏం కేకలో... ముదనష్టపు కేకలు" అని తిట్టుకుంటూ బాత్రూములో వేడినీళ్ళు పెట్టింది రత్నాబాయ్.

సోమశేఖరం బాత్రూములోకి వెళ్ళి తలుపేస్కున్నాడు.



అప్పుడే పక్కింటి సుబ్బాయమ్మ స్టీలు గ్లాసుతో కాఫీపొడి అరువడగడానికి వచ్చింది.

"ఉండొదినా! ఒక్క క్షణంలో ఇస్తా" అంటూ సుబ్బాయమ్మ దగ్గర గ్లాసు తీస్కుని వంట గదిలోకి వెళ్ళింది రత్నాబాయ్.

అదే సమయంలో బాత్రూము తలుపులు తీస్కుని కెవ్వుమని అరుచుకుంటూ బయటికి వచ్చాడు సోమశేఖరం.

ఒట్టి డ్రాయర్తో బయటకి పరుగెత్తుకుని వచ్చిన అతన్ని చూసి నోటిమీద "హవ్వ...! హవ్వ...!! హవ్వ...!!!" అని కొట్టుకుని ఓసారి గట్టిగా కేకపెట్టి కిందపడి గిలగిలా పది క్షణాలు కాళ్ళూ చేతులూ కొట్టుకుని మూర్ఛపోయింది సుబ్బాయమ్మ.





సుబ్బాయమ్మ కేక విని రత్నాబాయ్ వంట గదిలోంచి కంగారుగా బయటకి వచ్చింది.

"ఏంటీ అవతారం?... ఎందుకలా డ్రాయర్తో ఈవిడ ముందుకు పరుగెత్తుకు వచ్చారు?... ఒంటినిండా ఎలుగుబంటిలా బొచ్చుతో ఉన్న మిమ్మల్ని చూసి ఎలా మూర్ఛపోయిందో చూశారా?... అయినా ఆ కేకలేంటి ఆ పరుగులేంటి?..." మండిపడ్తూ అంది రత్నాబాయ్.

"అది కాదే... చెంబుతో నీళ్ళు మీద పోస్కోగానే వీపు కాలిపోయింది." సణుగుతూ చెప్పాడు.

"అంత కంగారెందుకూ... వేణ్ణీళ్ళలో నేను చన్నీళ్ళు కలపలేదు... కాస్త చూస్కో వద్దా?.. లోపలికి వెళ్లండి... మీ అవతారం చూడలేక చస్తున్నా..."

సోమశేఖరం బాత్రూములోకెళ్ళి తలుపేస్కున్నాడు.

రత్నాబాయి సుబ్బాయమ్మ మొహంమీద చల్లనీళ్ళు చల్లి, లేపి కూర్చోబెట్టి జరిగిందానికి క్షమాపణలు చెప్పి కాఫీపొడి ఇచ్చి పంపించేసింది.







సోమశేఖరం గబగబా స్నానం చేసి బయట కొచ్చి ఓసారి గోడ గడియారం వంక చూసి మళ్ళీ కెవ్వ్.. అని అరిచి డ్రస్సు వేస్కుని-

"నేనిహ వెళ్లొస్తా..." అని భార్యకి చెప్పి వరండాలోకి వచ్చాడు.

వరండాలో అతనికి నారాయణ కనిపించాడు.

"ఆc! ఏంటోయ్... ఏంటి సంగతి?" అని పలకరించాడు నారాయణని- సోమశేఖరం.

నారాయణ సోమశేఖరం ఎదురింట్లో ఉంటాడు.

"ఏం లేదు... ఊర్కే వచ్చా..." అని చెప్పి వరండాలో ఉన్న సోఫాలో కూర్చుని సోమశేఖరం వైపు చూసి "హిహిహి..." అని

నవ్వాడు.

సోమశేఖరం వాచ్‌వంక చూస్కుని ఇబ్బం దిగా "హిహిహి..." అని నవ్వాడు తనుకూడా.

"ఏంటీ అలా నిలబడే ఉన్నావ్... కూర్చో" అదేదో తన యిల్లు అయినట్టు సోమశేఖరంతో అన్నాడు నారాయణ.

సోమశేఖరం ఆముదం తాగినట్టు మొహం పెట్టి బలవంతంగా నవ్వి నారాయణ ఎదురుగా మరో సోఫాలో కూర్చున్నాడు.

"అదేంటి అంత ఇబ్బందిగా కూర్చున్నావ్... నీకేమైనా పైల్సా?... హిహి..." అని అడిగాడు నారాయణ.

సోమశేఖరం ఓసారి పళ్ళు పరపరా నూరి–

"నాకేం పైల్సులేవు..." అన్నాడు సోఫాలో వెనక్కి జారబడి రిలాక్స్ అయి కూర్చుంటూ.

"నీ పళ్ళు పరపరా భలే శబ్దం చేశాయ్!!... ఏదీ మళ్ళీ నూరు?..." ముందుకు వంగి కుతూ హలంగా చూస్తూ అడిగాడు నారాయణ.

ఎదురింటాయన అంత ముచ్చటపడి అడుగుతుంటే కాదని అంటే బాగుండదని పళ్ళు మరోసారి పరపరలాడించాడు సోమశేఖరం.

నారాయణ ఎంతో సంబరపడిపోయి–

"బాగుంది... చాలా బాగుంది..." అన్నాడు.

ఆ తరువాత తన వంశీయుల్లో ఎవరెవరికి పైల్సు ఉన్నాయో చెప్పాడు. పైల్సుకి ఏయే మందులూ, ఆయింట్‌మెంట్సూ వాడాలో



ఆఫీసర్ : మా కంపెనీలో సేల్స్‌మేన్ ఉద్యోగం కావాలనంటున్నావ్ కదా? నీకేమైనా అనుభవం ఉందా?

ప్రభాకరం: ఉందిసార్ మా పక్కింట్లో టీవీ అమ్మేశాను. మా ఆవిడ నగలు అమ్మేశాను. దొరికిన ప్రతి సెల్‌ఫోన్ అమ్మగలిగాను... ఈ ఎక్స్‌పీరియన్స్ సరిపోదా సార్?

చెప్పాడు.

సోమశేఖరంలో సహనం నశిస్తూఉంది. ఓసారి వాచ్‌వంక చూస్కుని కెవ్వుమని అరిచాడు.

"ఏంటి వాచ్‌వంక చూసి అలా అరిచావ్? వాచి అద్దం బద్దలయిందా? ఆ?..." అడిగాడు నారాయణ.

"వాచి అద్దం బద్దలవలేదుగానీ టైమైపోతూంది..." మెల్లగా చెప్పాడు సోమశేఖరం.

"టైమా?... దేనికయిపోతుంది??..."

తను పెళ్ళికి వెళ్ళాలనీ ముహూర్తం టైము, ఎక్కడ జరుగుతుందీ చెప్పాడు సోమశేఖరం.

"మరి నేను వెళ్ళనా?... ఆ??... హిహి" అడిగాడు సోమశేఖరం.

"అప్పుడే ఎందుకోయ్... ముహూర్తానికి ఇంకా చాలా టైముందిగా... కూర్చో కూర్చో... నీతో మాట్లాడాలని వస్తే... వెళ్ళిపోతానంటావేం?" అన్నాడు నారాయణ.

"అంటే అక్కడ పెళ్ళి పనులుంటాయ్ కదా! పెళ్ళేమో మా జనరల్ మేనేజర్ కొడుకుది" అంటూ లేచి నిలబడ్డాడు సోమశేఖరం.

"అయితే ఇంకేం... పెళ్ళిపనులు చేసేవాళ్ళు బోలెడంతమంది ఉంటారు... నువ్వెందుకూ వెళ్ళడం... కూర్చో..." అని సోమశేఖరం కాళ్ళు పట్టిలాగేశాడు.

సోమశేఖరం సోఫాలో దభీమని పడ్డాడు.

ఆ తరువాత నారాయణ సోమశేఖరంతో తెలంగాణ గొడవ గురించి... మన్మోహన్ మౌనం గురించి... అధిక ధరల గురించీ చెప్పాడు.

అతని మాటలు అయ్యేసరికి ముహూర్తం టైం కూడా అయిపోయింది.

"ఇంక నేనొస్తానోయ్" నారాయణ తృప్తిగా మొహంపెట్టి లేచాడు.

"ఎక్కడికీ?ఇంకాసేపు కూర్చుని మాట్లాడు." పళ్ళు నూర్తూ అన్నాడు సోమశేఖరం.

"అమ్మో... మా ఆవిడకి టైం ఇచ్చాను. ఇప్పుడు షాపింగ్‌కి వెళ్ళాలి!... లేకపోతే వీపు చీరేస్తుంది." వాచ్ చూస్కుంటూ లేచాడు నారాయణ.

"ఉండవోయ్... షాపింగ్‌కి రేపైనా వెళ్ళొచ్చు. షాపులెక్కడికి పోతాయ్... కాస్సేపు సర్దాగా మాట్లాడుకుందాం... కూర్చో..." అంటూ నారాయణ రెండు కాళ్ళమధ్య తన కాలుపెట్టి మెలేసి కిందపడేసి గుండెలమీద కూర్చున్నాడు సోమశేఖరం.

అప్పుడు అతనికి చెప్పడం మొదలుబెట్టాడు సోమశేఖరం తెలుగు నవలా సాహిత్యం తీరుతెన్నుల గురించీ, ఆవకాయ పెట్టడం గురించీ, అప్పడాలు వత్తడం గురించీ...

ఇంకా వాటి గురించీ వీటి గురించీ...



# ఐడియా...!













జంధ్యాల 'పెన్'సిల్... పెద్ద చేసిన...

# మల్లె పందిరి

డా॥ దివాకర్ చేసిన
వెండితెర నవ్వులీకరణ



అప్పుడే వచ్చిన బాలసూర్యుడు యధాలాపంగా కిటికీలోంచి చూస్తే – పైకి తన్ని పెట్టి, తననే వెక్కిరిస్తున్నట్టున్న రెండు వెదురు బొంగుల్లాంటి కాళ్ళు కనిపించాయి! 'ఇన్సల్ట్' భరించలేక మబ్బుల కోసం ఇంకాస్త పైకి పరిగెత్తాడు.

**ఆ కాళ్ళ** తాలూకు శాల్తీని ఇంకొంచెం పరిక్షైగాదిగా చూస్తూ కిందకంటూ వెళ్తే 'స్కిన్ టైట్ చర్మం తొడుక్కున్న ఈ అస్తిపంజరం అది' – అని ఎవరికైనా అనిపించక తప్పదు.

కానీ ఈ 'పంజరం' లో చిలకింకా ప్రాణంతోనే వుంది. కళ్ళు మిటకరించి చూస్తూవుంది కూడా! ఆ చూపుల్లో చూపులుబెట్టి చూస్తే – నడిచే మనిషీ, రోడ్డు మీది సైకిలూ, పరిగెత్తే కుర్రాడూ అంతట తలకిందులు గానే కనిపిస్తూన్నారు.

ఇంతకీ అసలు విషయం భీముడు (!) అనబడే ఆ 'సన్నకారు' శాల్తీ శీర్షాసనం వేస్తున్నాడు. మెళ్ళో తాయెత్తు నోట్లోపడి వేలాడుతోంది. మరో అరనిమషంలో ఏకంగా తన కాళ్ళొచ్చి తన నోట్లోనే పడతాయేమోనన్నట్టుంది అతని పరిస్థితి.

సరిగ్గా అప్పుడే లోపల్నించి "భీముడు" అని కేకేసింది బామ్మ.

"ఆ!" అని నీరసంగా జవాబిచ్చి "అయ్య బాబోయ్!" అని మూలుగుతూ, ఆసనం మీంచి దిగి.... మామూలైపోయాడు భీముడు.





వెంటనే నడుంపట్టింది. మామూలుగా మాత్రం కాదు. కళుక్కని మరీ!

'హమ్మయ్య' అంటూ మళ్ళీ మూలుగు మొదలు పెట్టాడు చతికిలబడి.

ఆడది నవ్వితే కిసుక్కుమనీ, మెరుపు మెరిస్తే తళుక్కుమనీ, గడ్డం పెరిగితే గరుక్కుమనీ, అనడం ఎంత సహజమో, అర్భకుడు 'జిమ్నాస్టిక్స్' చేస్తే నడుమో మరోటో కళుక్కుమనడమూ అంతే సహజం.

ఆ నాలుగిళ్ళ చావిట్లో ఈ భీముడూ, వాళ్ళ బామ్మ ఓ పోర్షన్‌లో అద్దెకుంటున్నారు. బామ్మ జీవితాశయం భీముడు – పేరుకు తగ్గట్టు తయారవ్వాలని. పాతికేళ్ళొచ్చినా ఎముకల గూడులా మిగిలిపోయిన భీముడ్ని కసరత్తు

చేయించందే ఏ రోజూ నిద్రపోదు భీముడికి బామ్మ– మనకు గోదావరమ్మ. ఇంటి పేరు 'కండలవారు!'




"నీ బొంద!" అని తిట్టింది గోదావరమ్మ.

"రెండు నిమిషాలు శీర్షాసనం వెయ్యడానికి నీకేమన్నా దొబ్బిడాయా?".

"ఇందా. ఈ నాలుగు బాదం పప్పులూ తిని, ఈ గుక్కెడు పాలు తాగు." అంది మళ్ళీ – ఓ ప్లేటెడు బాదం పప్పులూ, ఓ చెంబుడు పాలూ అతనిముందుకు తోసి... తనూ ప్రక్కనే కూచూంటూ.

"ఇవి నాలుగు! ఇవి గుక్కెడు!" వ్యంగ్యంగా అని వాటివైపు అయిష్టంగా చూశాడు భీముడు. బామ్మకు రాకూడని అనుమానమే వచ్చింది.

"సగానికి చీరేసిన పూచికపుల్ల బద్దలాగా, మా కండలవారి వంశంలో ఎలా పుట్టావో ఏమిటో!"

వంశవృక్షంలో ఎక్కడో ఏదో తప్పు జరిగిపోయినట్టు భీముడూ బేలగా మొహం పెట్టటంతో "ఊ! చూస్తావేం –తిను!" అని గద్దించి "మీ ముత్తాత వచ్చే రైలుబండిని ఎదుర్రొమ్ముతో ఆపాడట తెలుసా?" అంది గర్వంగా.

అలా చేసింది 'కోడి' వాళ్ళ తాలూకుగదా, మన 'కండల' వారి వంశానికి కనెక్షనెలాగ అని అడగబోయి, తేలిగ్గా "బొమ్మ రైలునేమోనే బామ్మ!" అన్నాడు భీముడు.

"ఆ మాట పట్టుకొని నన్ను ఎడాపెడా వాయించేస్తున్నావ్! బాదం పప్పులూ, జీడిపప్పులూ తింటుంటే, కండ పెరగడంలేదు– కడుపు మురుగుతోంది!" అని తన అసలు బాధా బట్టబయలు చేసాడు.

ఆఖరి మాటకు మంగపతి మంత్రముగ్ధుడిలా ప్రత్యక్ష మయ్యాడు.

మంత్రగాడికి 'మేజిక్ వేండ్'లా మంగపతి చెంబు లేకుండా ఎప్పుడు







కనబడడు. కారణం అతనో పెద్ద మలబద్ధకిష్టు. ఏ క్షణంలో ఏమవుతుందోనని ప్రాణాలు చెంబులో పెట్టుకొని జీవిస్తున్న వ్యక్తి. ఆ నాలుగిళ్ళ చావిళ్ళో బాత్రూమ్ చుట్టూ సదా ఈగలా పరిభ్రమించే మూల శంకర్రావే మంగపతి.

రోజులో ఇరవై మూడు గంటలు 'లేవెట్రి' లోనూ, ఓ గంట తన వాటాలోనూ వుంటూ, అద్దె కడ్తుంది 'అందుకే' నని వాదించే వ్యక్తి.

"ఎవరక్కడ కడుపు మురుగుతోందంటూన్నారు? ఓ గంటాగాలి. ఇక్కడేం ఖాళీల్లేవ్!" ఎ'మోషన్'తో వార్నింగ్ పడేసి, అప్పటికే తలుపులు బిడాయించి బాత్రూమ్ లోపలకూర్చున్న వ్యక్తిని ఉద్దేశించి "ఎవరయ్యా లోపల? సీరియల్ నవల్లు గాని రాసుకుంటున్నారా ఏమిటి? రండి తొందరగా... అర నిమిషం ఆలస్యమైతే ఒక్కడ ఘోర ప్రమాదాలూ అకాల మరణాలూ జరిగిపోగలవ్... అబ్బా!.. తెమలవయ్యా దేవుడా,

తెములూ... అబ్బా...” అని గింజు కుంటూ న్నాడు మూలశంక... సారీ.... పాలవంక మంగపతి.

సగం తెరుచుకున్న తలుపులోంచి, పదేళ్ళ డుంబూ తల మాత్రమే బయటపడేసి –

“ష్!.. అంత అర్జెంటైతే రోడ్డు మీదకెళ్ళి కళ్ళు మూసుక్కోవోవయ్యా! వూరికే అలా అరుస్తా వెందుకు?” అంటూ కేర్‌లెస్‌గా మళ్ళీ తలుపేసుకున్నాడు. ఆ ప్రక్కవాటాలోని తాగు బోతప్పారావ్ కొడుకు డుంబూ. చావిడి కంత టికి ఛలాకీ చిన్నోడు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే పుస్తకాల్లోంచి వూడి పడ్డ ‘బుడుగు’ అప్పారావ్ మాత్రం సదా ‘సేవా’ రావు. కారణాలు వెదుక్కుని మరీ సేవి స్తుంటాడు ముప్పూటలా. ఏ కారణమూలేని పూట కారణం దొరకని కారణంగా తాగగల ‘కారణజిన్ముడు.’

ఆ వుదయాన్నే మేడ మీద ‘మందూ-మార్బలం’ బల్ల మీద పేర్చుకొని, ఎదురు గుండా కుర్చీలో ‘చుక్కాసీనుడై’ ఒక్కడే కూర్చు న్నాడు అప్పారావ్. పని కానిచ్చిన డుంబూ పైకొచ్చాడు.

“నాన్నా! పొద్దున్నే తాగుతున్నావా?.... నీకే మన్నా బుద్ధుందా ?” అని చివాట్లేసాడు పెద్ద ఆరిందా తెల్లారిందాలా.

“లేదురా! బుద్ధంతా మీ అమ్మమాటగట్టు కుని వెళ్ళిపోయింది!... ఇవ్వాళ దాని పుట్టిం




రోజురా. అది గుర్తొచ్చి....”

మాట పూర్తికాకుండానే డుంబూ అందు కున్నాడు. “ఏమిటి? ఇవ్వాళ అమ్మ పుట్టి న్రోజా?” అన్నాడు మూతికి ప్లాస్టరేశే మొన గాడిలా పోజుపెట్టి.

అప్పారావు అసలేం చలించలేదు తన దగ్గ రున్న సంజాయిషీ మీద అంత నమ్మకం అతనికి–

“నిన్న తారీఖుల ప్రకారం. యివ్వాళ తిథుల ప్రకారం, నువ్వు నోర్మూసుకో... ఇంద ఈ అయిదుపైసలూ పట్టుకుని సిన్మాకి ఫో!” అన్నాడు–ఈ కోటిపట్టికెళ్ళి ఖుషీ చెయ్య మన్నంత లెవెల్లో.

“అయిదు పైసల్తో సిన్మాకెళ్ళనా? వొద్దులే. ఇది నువ్వే వుంచుకొని ఇల్లు కట్టుకో” మని తుర్రుమన్నాడు డుంబూ.

ఇంతలో ఓ చెయ్యి పేక కలుపుతూ ముందు కొస్తోంది.

ఆ చెయ్యి తాలూకు ఓనరు పేరిశాస్త్రి మెట్లె క్కి మేడ మీదకొచ్చాడు.

ఇతనా చావిట్లోని ఓ ‘పేకమేక’.

కార్డు కనిపిస్తే చాలు కళ్ళతోటే మేసేస్తాడు. పదమూడు ముక్కల డిజైను – రంగుల్లో వున్న శాలువా ఎప్పుడు ఒంటినంటుకునే వుం టుంది.

గురజాడగారి వాక్యాల్లోని దేశాన్ని ‘డ్రాప్’ చేసి పేకావేశంతో పదం పాడుతున్నాడు–

“పేకలను ప్రేమించుమన్నా–మంచియ న్నది పంచుమన్నా!” మందులోతుల్లో తేల్తున్న అప్పారావు కనిపించగానే–

“హలో అప్పారావ్... ఆ! ఏమిటి? ఈ చెత్తంతా తీసేసి మాంచి ఆటవేసుకుందా మేమిటి? బల్లకూడా బావున్నట్టుంది” అన్నాడు పేకదస్తావేజు తెరిచేస్తూ.

అప్పారావుకు చిర్రెత్తుకొచ్చింది.

“ఆ దరిద్రపు గొట్టు ఆట సంగతి నా దగ్గ రెత్తకు. కంట్లో సారాపోసెయ్యగలను జాగ్రత్త!” అన్నాడు కొన్ని చుక్కలు వేస్తయిపోయినా ఫరవాలేదనుకొని. **(సశేషం)**



## కొత్త పుస్తకం!

# చీర పజ్యాలు

సరస శతకం



ప్రతీ దేశానికి తనకంటూ ఓ భాషా, భూష వుంటాయన్నది చరిత్ర కారులు ఒప్పుకునే సత్యమే - భారతీయ కట్టు-చీర !

ఈ చీర ప్రాచీనతను, ప్రాశస్త్యాన్ని, సొగసునూ కంద పద్యాల్లో రచయిత బ్నిం ఈ చీర పజ్యాలు అనే పుస్తకం అల్లారు.

సున్నిత హాస్యం, క్రియేటివిటీలని పడుగు, పేకగా అల్లిన వంద పద్యాలు - (రచయిత 'పజ్యా'లన్నారు) ఈ 'చీరశతకం'.

బాపూ బొమ్మ అనే చీరకట్టుతో ముస్తాబై అట్టహాసం చేస్తున్న 32 పేజీల శతకం - (2×స్వీట్ సిక్స్టీన్) ఇది.

రామాయణం, భారతం, భాగవతాల్లో చీరల ప్రస్తావనలను చెప్పే ఘట్టాలను స్పృశిస్తూ, రచయిత 'చీర అనాదిగా భారతీయుల వారసత్వ సంపద' అని చెప్పారు.

శతకంలోని పద్యాల్లో - చీర సింగారాన్ని, చీరలో అతివ అందం ఎలా ఇనుమడింపబడేదీ ఓ ఆరుపద్యాలలో అందించారు 'బ్నిం'.

రంగునుబట్టి 'కట్టుకొన్న' వారి 'మూడ్' తెలియజేస్తుందంటూ, ఓ నాల్గు పద్యాల్లో వర్ణిస్తూ - శుభకరమైన తెల్లచీర ప్రాధాన్యత, అలక సంకేతమైన కైక మార్కు నల్ల చీరలను పేర్కొన్నారు బ్నిం.

కొంగుముడి వేసుకొని అగ్ని చుట్టూ తిరిగే పవిత్రత వున్న పునీతగా నేత చీరను ప్రస్తుతించారు.

పద్యాలన్నా, సంప్రదాయ దుస్తులన్నా మండిపడే కుసంస్కార సంఘాటలకు ధైర్యంగా, ఆరువాతలు పెట్టారు-'పజ్యాల' కంద దురద అంటేలా.

తొమ్మిది గజాలు నుంచి...ఏడు నుంచి... ఐదున్నర గజాలైనా చీరకు దీటులేదు. దాని పరువే వేరు - చీర పెట్టటం ఓ 'సన్మాన' చిహ్నం అంటారు 'బ్నిం'.

పరికిణీ నుంచి చీరకు ఎదిగిన అమ్మాయిలను - అమ్మలను అభినందించారు రచయిత!

పేరంటానికి ఏ డ్రస్సులు నప్పవు... చీర తప్ప! -అంటారు రచయిత.

తల్లుల జ్ఞాపకంగా 'కూతుళ్లు' పొందే 'పట్టుచీరల' మెమెంటోలను రచయిత స్పృశించారు.

విసిగినా, వెలిసినా, చిరిగినా కూడా పనిపిల్లకి దానంగా... మనవడికి బొంతగా... బాత్రూంలో టవల్ గా... మారే 'నేతచీర' నేస్తాల్ని రచయిత కొనియాడారు.

ఓ కార్టూనిస్టుగా, సృజనాత్మకత వున్న చేయి తిరిగిన రచయితగా 'పజ్యా'లను అల్లారు 'బ్నిం'. ఓసారి చదివి, మురిసి, మరోసారి చదువుకొనేలా-(కలసి) వున్నదీ 'పజ్యాల సమాహారం'.

ప్రతీ వనితా సొంతం చేసుకోదగిన పుస్తకం - బహుమతిగా 'పెట్టుకో దగ్గ' పుస్తకం.

ఈ సంప్రదాయ కట్టు, బొటులకు రూపశిల్పులు 'బాపూ' రమణకు ఈ పుస్తకాన్ని అంకితమివ్వటం - బాపూగారి పుట్టినరోజున ఈ పుస్తకాన్ని విడుదల చేయటం -శిష్యునిగా 'బ్నిం'కి అదో తుత్తి.. తుత్తి... 'సెటిస్‌ఫేక్షన్' .

క్లియరెన్స్ సేల్స్, రిబేట్లు, తగ్గింపురేట్లు అంటూ వుండే చీరల ధరల వలె ఈ పుస్తకం రేటులో కూడా ముదరాయింపులు ఇవ్వటం మరో చమత్కారం -

**5 పుస్తకాలు కొంటే వందరూపాయలు, విడిపుస్తకం 30 రూ॥లట.**

-బి.యస్.శర్మ

**ప్రతులకు:** బ్నిం, నెం.12-11-448, వారాసిగూడ, సికింద్రాబాద్-500 061

**వివరాలకు:** ఫోన్:9866107289




ప్రతి యంగుళమపురూపము
అతి ఫేషన్ డ్రస్సులేయ అధ్వాన్నమెగా
అతివల అందము నిలుపగ
మితిమీరని చీరకన్న... మీరదు ఏదీ!

వెడలగ పోరుకు చీరను
నడుమును బిగియించి రోషనారై తోచున్
ఒడలొంచి పనులు చేయగ
ముడిచి, మడిచి నడుమగుచ్చు
ముచ్చటలొలుకన్

శారీకిన్ డ్రసులకున్
తీరే వేరుండు కట్టు దీనికి దాన్కిన్
చీరను వేసిన రోజున
'నారీన్ నేనన్న'తృప్తి నరముల తిరుగున్

కట్టిన చీర కలర్లను
పట్టిగనే కట్టదంచు పతి ఎరుగ వలెన్
గుట్టేమిటొ తెలియగ 'రస
పట్ట'ంతా దొరికినట్లె భర్తకు వింటే!

నారంశెట్టి ఉమామహేశ్వరరావు
9290660220



# యముడికి మొగుడు

**ఫ**స్ట్ షో సినిమా రిలీజ్ రోజున చూడాలని వెళ్ళిన ఈశ్వర్‌కి హౌస్‌ఫుల్ బోర్డు వెక్కిరించింది.

ఈ రోజుల్లో హాల్లన్నీ ఖాళీగా ఉంటున్నాయే! ఇదేం వింత అనుకోవద్దు.

ఆ సినిమా ప్రముఖ హీరో భీమ్ కరణ్ పీజా నటించింది కావడమే రీజన్.

సినిమా పేరే 'సునామీ'. అయితే రిలీజ్ అయిన మూడు రోజుల తర్వాత తేలింది అది సునామీ కాదు ఒట్టి బినామీ అని. అది వేరే విషయం.

మనోడు ఉసూరుమంటూ రోడ్ మీద కాళ్ళీడుస్తుంటే దార్లో ఉన్న ఫంక్షన్ హాల్ నుండి ఏదో ప్రోగ్రామ్ జరుగుతున్నట్లు మైక్‌లో వినబడగా అటువైపు బైక్ పోనిచ్చాడు.

ఈశ్వర్ ఏం చేస్తాడు అంటే టూకీగా... ఏమీ చేయడు! సమయానికి తింటాడు. అమ్మా నాన్నలిచ్చిన డబ్బులు ఖర్చు పెడతాడు. బలాదూర్ తిరుగుతాడు.

ఆ సమయానికి మంత్రి శంభులింగం గారు మాట్లాడుతున్నారు. ఆయన నీటిపారుదల శాఖామంత్రి. నీటి ప్రాజెక్టులనుండి నీరు పారుతుందో లేదో చెప్పలేం గానీ... మినిస్టర్ గారు మైక్ అందుకుంటే మాత్రం మాటలు, నోటి నుండి తుంపర్లు వరదలై పారుతాయని అంతా అనుకుంటారు.

బయట బేనర్ చూడకుండా లోపలకు అడుగుపెట్టిన ఈశ్వర్‌కి కాసేపు అయోమయంగా అన్పించింది.

"ఏం జరుగుతోందిక్కడ?" ప్రశ్నించాడు.

"కనబడ్డం లేదా?... రిటైర్‌మెంట్ ఫంక్షన్ జరుగుతోంది" జవాబు విన్పించింది ముందు నుండి.

"అలాగా! ఎవరిది?" మరల ప్రశ్నించాడు ఈశ్వర్.



"రిటైర్ అయ్యినోళ్ళది" వ్యంగ్యంగా వినబడింది ప్రక్కనుండి.

ఈశ్వర్‌కి చురుక్కుమంది. కానీ అదేం కన్పించకుండా– "అది కాదు సార్! ఏ శాఖ ఉద్యోగులు చేసుకుంటున్నారు అన్న ఉద్దేశంతో అడిగాను" అన్నాడు.

"నాయనా! నీదేవూరు? స్టేజ్ మీద ఉన్న వారిని చూస్తే వారిదే డిపార్ట్‌మెంటో తెలియట్లేదా?" తిరిగి ప్రశ్నించాడు తప్ప జవాబివ్వలేదా వ్యక్తి మొరార్జీ దేశాయ్‌గారిలాగా.

ఆయనా అంతే! పత్రికల వారెళ్ళి ప్రశ్నలడిగితే తిరిగి ప్రశ్నలే జవాబులుగా అడిగేవారట.

మంత్రిగారు సన్మాన గ్రహీతనుద్దేశించి మాట్లాడుతూ– "వీరున్నారే... యముడికి మొగుడు! స్వర్గానికి బెర్త్ కన్ఫర్మ్ చేసుకొని సగం దూరం ప్రయాణించిన పేషెంట్స్‌ని కూడా యముడితో పోరాడి భర్త ప్రాణాలు దక్కించుకున్న సావిత్రిలా యముడితో దెబ్బలాడి వారి ప్రాణాలు కాపాడారు. ఆఫీసర్లు పెన్ను వాడినంత సులభంగా ఈయన ఆపరేషన్ టేబుల్ మీద కత్తి వాడతారు." అలా ప్రసంగం సా...గి.... పోతుంటే అప్పుడు ఈశ్వర్‌కి గుర్తొచ్చింది. మంత్రిగారు చెబుతున్నది ప్రముఖసర్జన్ మోహనరావుగారి గురించని.

"ఈ మినిస్టరొకడు మైక్ దొరికితే చాలు మైక్ టైసన్‌ని మించిపోయి రెచ్చిపోతాడు. ఆరోగ్యశాఖ మినిస్టర్‌ని కాకుండా ఇతడ్నెవరు పిల్చారండీ?" గుసగుసగా ఎవరో అన్నారు.

"మన ఊరువాడు కాబట్టే ఈయనయినా వచ్చాడు. లేకపోతే రిటైర్మెంట్ ఫంక్షన్‌కి వస్తారేమిటి? ఐనా హెల్త్‌మినిస్టర్‌ది మన జిల్లా కూడా కాదు. పిలవగానే ఆయనెందుకొస్తాడు?..." మరొకరు జవాబు చెప్పారు.

ఈ లోగా మినిస్టర్ వేదిక మీద ఉన్న మరో వ్యక్తికి సన్మానం చేసి అతడి గురించి మాట్లాడుతున్నాడు.

"మోహన్రావుగారి గురించి అందరికీ తెలుసు... ఆయన హస్తవాసి తెలియని వారు ఈ చుట్టుపక్కల ఊళ్ళలోనే లేరు! కానీ వీరున్నారే! వీరి గురించి బయట జనానికి తెలియదు. వీరి సేవలు గుప్తదానాల్లా... గుప్త సేవలంటే నమ్మండి... డాక్టర్ మోహన్రావు 'యముడికి మొగుడు' యితే వీరు ఆ 'మొగుడికి వీరమొగుడు'. ఆపరేషన్ థియేటర్‌లో ఆఖరి శ్వాస పీలుస్తూ హరీ అనబోయే వారికి ఊపిరి పోసారీయన. తులసితీర్థం తాగే ఛాన్స్ మిస్సయ్యి బార్ కెళ్ళి బీరు తాగే లక్కీఛాన్స్ కొట్టేసారంటే నమ్మండి.... అది వీరి క్రెడిట్..."




ఇంకా.... కొనసా.. గు..తోంది మినిస్టర్ ప్రసంగం.

ఈశ్వర్‌కి ఈసారేమీ అర్థం కాలేదు. అంత గొప్పవాడా ఇతడు? ఎవరబ్బా? తనదీ ఈ ఊరే. మరి ఇతడి గురించి వినలేదెప్పుడూ. కొత్తడాక్టరా? చీఫ్ సర్జనా? పరిపరి విధాలా ఆలోచించి, చించి.. నా... ఏమీ తోచలేదు. ప్రక్కవ్యక్తే శరణమయ్యాడు.

"మీరు మెడికల్ స్టాఫేనా?" ముందు కన్‌ఫర్మ్ చేసుకోడానికి అడిగాడు.

"కాదు! మెడికల్ షాపు" చెప్పాడతడు.

'ఏదైతే ఏం లెండి ప్రజలను జలగల్లా పీల్చుకోడానికి...' మనసులో అనుకుని–

"సార్!...నాకో చిన్న డౌట్! అతడు డాక్టరా? లేదంటే ఇంకా గొప్పోడా" ప్రశ్నించాడు ఈశ్వర్.




"మీకెందుకలా అన్పించింది?" ప్రశ్నించాడు పక్కాయన.

"మోహన్రావుగారి కంటే గొప్పవాడని మినిస్టర్ చెబుతుంటేనూ...." ఆగాడు ఈశ్వర్.




"హహ్హహ్హ! అదా సంగతి. అతడేమో మినిస్టర్‌గారి చుట్టం. అతని గురించే మినిస్టర్ ఈ ప్రోగ్రామ్‌కి వచ్చింది. దీనికి ప్లస్సు మినిస్టర్‌కి బంధుప్రీతి... ఎంతెక్కువంటే ... అతని బాడీలో ఉన్న కొలెస్ట్రాలంత. గోరంతలు కొండంతలు చేసి చెప్పడం మినిస్టర్‌కి పదవితో అబ్బిన విద్య. అందుకే అలా గేస్ కొడుతున్నాడు. అంతే. ఇంతకీ, మీ దృష్టిలో అతడెవరనుకుంటున్నారు. కొంపదీసి చీఫ్ సర్జననుకున్నారా" అడిగాడతడు.

"అవును." పొంగిపోయి చెప్పాడు ఈశ్వర్.

ఈసారి మరింత గట్టిగా నవ్వాడు ప్రక్కాయన.

"అతడు గవర్నమెంట్ హాస్పిటల్ లో వార్డ్ బోయ్. ఆపరేషన్ థియేటర్‌లో బెడ్ మీదున్న పేషెంట్స్‌కి ఆక్సిజెన్...అంటే ప్రాణ వాయువు పెడతాడు. దాన్నే మినిస్టర్ ఊపిరి పోస్తాడని చెప్పారు. అంతే!'.

"ఓర్నీ....!!!!" ఆశ్చర్యపోవడం ఈశ్వర్ వంతయింది.



# కండ్లకుంట శరత్‌చంద్ర

# హాస్యచంద్ర 001



**"వాళ్లంతా ఎవరండీ? మీ బంధువులా?" అడిగాడు హాస్యచంద్ర.**

**"ఆ... చిదంబరం మా తాతయ్య, సోనియాగాంధీ మా అమ్మమ్మ, దిగ్విజయ్‌సింగ్ మా పక్కింట్లో ఉంటాడు. కె.సీ.ఆర్. మాకు పాలప్యాకెట్లు వేస్తాడు. వై.యస్.జగన్ మా ఆడిటర్, చంద్రబాబు మా ఆధ్యాత్మిక గురువు, కిరణ్‌కుమార్‌రెడ్డేమో... మా కేబుల్ టీ.వీ. ఆపరేటర్." సీరియస్‌గాఅన్నాడు ప్రహేళికరావు.**

**" ...................... "**

**"జోకులొద్దు! నీది ఏ కులం?"**

**"చిప్పకులం." చెప్పాడు హాస్యచంద్ర.**

**"అదేం కులం?"**

**"శ్రీకృష్ణదేవరాయల కాలంలో కొబ్బరి చిప్పలతో ఆయుధాలు తయారుచేసేవారు. వారిని చిప్పలోళ్ళు అని పిలిచేవారు. మాది ఆ కులమే. ఏం... హిస్టరీలో చదువుకోలేదా?" హాస్యచంద్ర మర్యాదగానే అడిగాడు.**

"ఆయన హిస్టరీలో వీక్ బాబూ..." అంది సురభి.

ప్రహేళికరావు, భార్య వంక సీరియస్‌గా చూశాడు.

"మాది ఏం కులమో తెలుసా?" ప్రహేళికరావు సీరియస్‌గా అడిగాడు.

"తెలీదండి. శతకోటి బోడీ కులాల్లో... ఏదో ఒకటి అయివుంటుంది."

"ఊ! మాటకు మాట బాగానే చెపుతున్నావ్. అది వదిలెయ్! నీ నెలజీతం ఎంత?"

"నెలకు నాలుగు కిలోల ఉల్లిపాయలు ధైర్యంగా కొనగలను. ఇక, మీరే లెక్కేస్కోండి."

"ఆహా! ఆ మాత్రం ఉల్లిపాయలు కొనే వాళ్ళను మా అమ్మాయికి... నేను వరుడుగా తేలేనా!"

"తప్పకుండా తేగలరు. కానీ నాలా ధైర్యం, నిజాయితీ, తెలివితేటలు, ప్రేమించే గుణం, హాస్య చతురత ఉన్న వాడిని అంత ఈజీగా తేలేరు."

ప్రహేళికరావు ఈగో దెబ్బతింది.

"అంటే తండ్రిగా నేను అన్‌ఫిట్ అంటావ్!"

"నేను ఆ మాట అనలేదు."

"మళ్ళీ సోనియాగాంధీ ... హూఁ! ఎందుకులే! నీ గురించి నువ్వే డబ్బా వాయించుకుంటున్నావ్!" ఎకసెక్కంగా అన్నాడు ప్రహేళికరావు.

"క్షమించాలి. కొన్ని విషయాలు... మన గురించి మనం ఇతరులకు చెప్పుకుంటే తప్ప, వారికి అవి తెలియవు. ఉదాహరణకు శ్రీయుతులు చిరంజీవి ... ఇంద్ర సినిమాలో, తప్పు నా వైపుంది. కాబట్టి తలొంచుకెళ్తున్నాను... లేకపోతే ఇక్కడి నుండి తలకాయలు తీసుకెళ్ళే వాడిని" అంటారు. శ్రీశ్రీశ్రీ బాలకృష్ణగారు... సింహా సినిమాలో 'ఒకవైపు చూడు. రెండోవైపు చూడకు... తట్టుకోలేవ్ ...' అంటారు. శ్రీమాన్ పవన్‌కళ్యాణ్‌గారు... 'నాక్కొంచెం తిక్కుంది. అయినా దానికోలెక్కుంది ...' అంటూ గబ్బర్ సింగ్‌లో అంటారు. ఇలా బోలెడు... ఇవన్నీ ప్రజలు ఆదరించారు. ఇవేవీ ఆయా పాత్రల స్వీయడబ్బా వాయింపుడు క్రిందకి రాకపోతే... నాదీ రాదు." అన్నాడు.

సీలా తెలివితేటలు గట్రా ఉన్నవాళ్ళు మా కులంలో చాలామంది ఉన్నారు" అంది సురభి.

"ఒక చిన్న విన్నపం. తెలివితేటలకు, కులానికి సంబంధం లేదు. గాంధీ, అంబేద్కర్, సర్వేపల్లి రాధాకృష్ణన్, మోక్షగుండం విశ్వే

**జరిగిన కథ:** హాస్యచంద్ర ఓ ప్రైవేట్ డిటెక్టివ్. ఒక పెద్ద షాపింగ్ కాంప్లెక్స్‌లో భార్య తప్పిపోతే కంగారు పడుతున్న ఒకతనికి మాస్టర్‌ప్లాన్ వేసి అతని భార్య అక్కడికి చేరుకునేట్లు చేస్తాడు హాస్యచంద్ర. ఈ సంఘటన చూసిన చాలామంది హాస్యచంద్ర ఫోన్ నెంబరు తీసుకుంటారు. ప్రహేళికారావు- తన కూతురు వెంట ప్రేమిస్తున్నామంటూ ఎవరైనా పడుతున్నారా కనిపెట్టమని హాస్యచంద్రకు ఫోన్ చేస్తాడు. ఆ కుర్రాల లిస్ట్ తీసుకొచ్చి ప్రహేళికారావుకిస్తాడు హాస్యచంద్ర. ఆ కుర్రాలను పిలిపించి వారందరిచేత తన ఇంట్లో నానా రకాల చాకిరి చేయిస్తాడు.వారందరికీ ఓ పరీక్ష కూడా పెడతాడు.

శ్వరయ్య, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, దాశరథి... ఇలా చాంతాడంత లిస్టుంది. కావాలంటే పరిశీలించుకోండి."

"ఇవన్నీ అనవసరం. నువ్వు మాకు అల్లుడవడం మాకు ఇష్టం లేదు."

"ఎందుకు?"

"మా అల్లుడిని మేమే సెలక్ట్ చేసుకుంటాం."

"ఏడ్చినట్లుంది. మీ అమ్మాయి సెలెక్ట్ చేసుకుంటే ... వాడు మీకు అల్లుడవుతాడు. అదీ తల్లీబిడ్డా న్యాయం. అంతేగానీ మీరు అల్లుడిని సెలెక్ట్ చేసుకుంటే ... వాడు మీ అమ్మాయికి మొగుడవడం 1980లాజిక్కు! ఇది 2014!!"

సబ్ కాస్ట్‌కు చెందిన వారు రెండు కిలోలు... వారిలో ఉద్యోగస్తులు కిలోన్నర. మీ గోత్రానికి చెందిన వారు కిలో... ఆ కిలోలో మీరు కోరుకొనే ఉద్యోగస్తులు అరకిలో... వారిలో మీ అమ్మాయి కంటే ఎత్తులో ఎక్కువ ఉన్నవారు పావుకిలో... ఈ పావుకిలో మంది ఒక్కచోట ఉండరు. దేశవిదేశాల్లోను... రకరకాల జిల్లాల్లోనూ ఉంటారు. మీరెంత కష్టపడినా ఈ పావుకిలో నుండి మీరు యాభైగ్రాములు పట్టుకోగలరు. ఇహ ఈ యాభై గ్రాములలో మీ అమ్మాయికి నచ్చేవారు మీ అమ్మాయిని మెచ్చేవారు తక్కువ కట్నం తీసుకొనే వారు... ఓ తులం ఉంటారు.

చించుకుంటా, చించుకుంటూ, కుంటూ ఉండండి" చెప్పి హాస్యచంద్ర వెళ్ళిపోయాడు.

"వామ్ వీడు వదిలేలా లేడు. ఇంటర్‌కాస్ట్ మేరేజ్ చేస్తే బంధువులలో నా పరువు పోతుంది. పోలీసులకో, గూండాలకో చెప్పి వీడి పని పట్టాలి" అన్నాడు ప్రహేళికరావు కోపంగా.

వెంటనే హాస్యచంద్ర లోపలికి వచ్చి–

"దాహం వేస్తోంది!" అంటూ ఫ్రిజ్ దగ్గరకి వెళ్ళి తలుపు తెరిచి మంచినీళ్ళు తాగి చెప్పాడు.

"హైదరాబాద్‌లో ఉండే ప్రతి పోలీస్ ఆఫీసర్‌కు నేను తెలుసు. మొన్నా మధ్య క్రైం బ్రాంచ్ వాళ్ళ కుక్క తప్పిపోతే నేనే వెతికి తెచ్చాను. దిల్‌షుక్‌నగర్ పాండు చెల్లెల్ని ఓ గ్యాంగ్ కిడ్నాప్ చేస్తే ... నేనే కనిపెట్టి రక్షించి తెచ్చాను. మెహదీపట్నం అబ్బాస్ అలీ



"అవన్నీ మాకు తెలీదు... మాకు ఇష్టం లేదు." అంది సురభి.

"మీ అమ్మాయికి మొగుడిని ఎలా వెతుకుతారు? బంధువులకు, పెళ్ళిళ్ళ పేరయ్యలకు, మేరేజ్‌బ్యూరోలకు చెప్తారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ఉండే జనాభాలో యువకులు ఓ వందకిలోలమంది ఉన్నారనుకుంటే... అందులో పెళ్ళికాని వారు యాభై కిలోలమంది... వారిలో మీ కులానికి చెందిన వారు ఐదు కిలోలు... వారిలో మీ ఉపకులానికి ... అంటే

ఈ తులాన్ని మీరు పట్టుకోవాలంటే ... ఢక్కాముక్కీలు తినుట, చెప్పులు అరిగేలా తిరుగుట భగీరథ ప్రయత్నం... ఇలాంటి జాతీయులకు మీరు న్యాయం చెయ్యాల్సి ఉంటుంది. ఇంత కష్టపడకుండా మీకు సింపుల్‌గా నాలాంటి ఉత్తముడు దొరకడు."

ప్రహేళికరావు, సురభిలు మొహామొహాలు చూసుకున్నారు.

"నాకు పనుంది... నేను వెళ్ళొస్తాను. ఆలో

భార్య నూర్జహాన్ గారి డైమెండ్ నెక్లెస్ ఒకడు ఎత్తుకుపోతే ఇరవై నాలుగు గంటల్లో కనిపెట్టి తెచ్చాను. వీళ్ళందరూ గూండాలే. ఇహ ఆకురౌడీలను, గల్లీ రౌడీలను దింపితే ... తన్నగలిగినంత మందిని తంతాను. మిగతా వాళ్ళను పోలీసులతో కుమ్మిస్తాను."

ప్రహేళికరావు మొహం మాడ్చుకుని, "నీకు మా అమ్మాయే దొరికిందా!" అన్నాడు.

"నిజానికి నేను ముంబాయిలో ట్రైనింగ్

తీసుకుంటున్నప్పుడు మాకు ట్రైనింగ్ ఇవ్వడానికి వచ్చిన బృందంలో ఓ అమెరికన్ అమ్మాయి నాకు బాగా నచ్చింది." అన్నాడు హాస్యచంద్ర

"మరి దాన్ని చేస్కొని చావొచ్చుగా!"

"చావొచ్చు. కానీ నాకు అప్పుడే స్వర్గం, నరకం అంటే తెలిసాయి. అందుకే తప్పుకున్నాను".

"అదేంటి?"

"అమెరికా జీతం, చైనా భోజనం, బ్రిటన్ ఇల్లు, ఇండియా భార్య ... ఇవీ స్వర్గం! చైనా ఇల్లు... బ్రిటన్ భోజనం... ఇండియా జీతం... అమెరికా పెళ్ళాం... ఇవీ నరకం!" చెప్పేసి వెళ్ళిపోయాడు.

"వీణ్ణి ఎలా వదిలించుకోవాలబ్బా!" ప్రహేళికరావు తీవ్రంగా ఆలోచించసాగాడు.

అతడు అరగంటసేపు ఆలోచించాక ...

ఓ అద్భుతమైన ఉపాయం తట్టింది.

'దాంతో వాడిపని స్మాష్" అనుకున్నాడు. అయితే అన్నీ భార్యతో చర్చించే ప్రహేళికరావు, ఇది మాత్రం చర్చించలేదు. చర్చించలేదు కూడా!!!

✦✦✦

నేరేడు పళ్ళను పిండి, దేవుడు ఆకాశానికి పూశాడేమోనన్నంత కటిక చీకటి.

ఆరున్నర అడుగుల ఆకారం. ఆ చీకటిలో ప్రచండవేగంతో నడుస్తోంది.




ఆ ఆకారం చేతిలో ఓ పాత తోలు సంచి భుజానికి వ్రేలాడుతూఉంది.

అతడు శ్మశానంలో ప్రవేశించాడు.

ఆరడుగుల నాగపాము ... ఎండుటాకులపై సర్రున పాకుతోంది. మర్రితొర్రల్లోనుండి గుడ్లగూబలు భయంభయంగా చూస్తున్నాయి.

అతడు ఓ చోట ఆగి తన వస్తువులను అక్కడ పెట్టి కాస్త దూరంలో ప్రవహిస్తున్న గంగానదిలో కాళ్ళూ చేతులు శుభ్రంగా కడుక్కుని వచ్చాడు.

ఆ తర్వాత తన తోలు సంచీలో నుండి వస్తువులను బయటకు తీస్తూ చెప్పసాగాడు.

"మర్రి, రావి, జువ్వి, మద్ది, వేప చెట్ల వేర్లు కాల్చి తయారుచేసిన భస్మం. ప్రయోగం చెయ్యాల్సిన అమ్మాయి వెంట్రుకలు. పులి మూత్రం. పసుపు, కుంకుమ, నిమ్మకాయలు. మంచి గుమ్మడికాయ, నాలుగు మేకులు, ముగ్గు, నోరు పుక్కిలించడానికి మంచినీళ్ళు, రంపం ..." ఆ తర్వాత పైకి లేచి శ్మశానంలో ఓ చెట్టుకు కట్టేసుంచిన మేకపిల్లను తాడుతో సహా లాక్కొచ్చి నేల లోనికి ఓ కర్రను పాతి కట్టేశాడు.

"ముందుగా నోరు కడుక్కోవాలి!" చెప్పి మంచినీటితో నోరు శుభ్రం చేసుకున్నాడు.

"భేతాళుడిని ఆహ్వానం చేస్కోవడానికి హ్రైం హ్రీం ఇ.వి.వి. సత్యనారాయణ స్వాహా ... అనే మంత్రాన్ని పదకొండు సార్లు జపించాలి" చెప్పి జపించాడు.

"ఇప్పుడు ముగ్గు వేయాలి. దీన్ని పంబలకిడి ముగ్గు అని మంత్రశాస్త్రం ఘోషిస్తోంది." చెప్పి ఆరు చుక్కల ముగ్గు అష్టదరిద్రంగా గీసాడు.

"ముగ్గుముందు శునకాసనంలో కూర్చుని– హ్రైం,హ్రీం ధర్మవరపు సుబ్రహ్మణ్యాయస్వాహా అనే మంత్రాన్ని డబ్భై మార్లు జపించాలి" చెప్పి జపించాడు.

"ఇప్పుడు బాసింపట్టు వేసుకుని కూర్చుని నిమ్మకాయలను కోసి వాటికి పసుపు, కుంకుమ అద్ది ముగ్గులో వేయాలి. వేస్తూ ... ఏందిబే ఎట్టాగ ఉందివోళ్ళు... ఎక్కడో గుచ్చావు చేప



ముల్లు అనే సాహితీ విలువలు కలిగిన పాట ను పాడాలి" చెబుతూ ఆ తంతు పూర్తి చేస్తాడు.

"ఇప్పుడు పులి యొక్క ఒంటేలును ... ఆ నిమ్మకాయలపై ప్రోక్షణం చేస్తూ ... బెకబెకబెక అనే మహా మాండూక మంత్రాన్ని జపించాలి" చెప్పి ఆ క్రియ నిర్వహించాడు.

"ఓ రమణారెడ్డి, ఓ రేలంగి, ఓ పద్మనాభం, ఓ రాజబాబు... అని జపిస్తూ... నాలుగు మేకులను... ముగ్గుకు నాలుగు వైపులా పాతాలి" ఆ పని చేసాడు.

"ఇప్పుడు ప్రయోగం చెయ్యవలసిన అమ్మాయి శిరోజాలను ముగ్గులో వేసి, గుమ్మడికాయ కొట్టి ... ఆరేసుకోబోయి పారేసుకున్నాను అనే పాటకు పేరడిగా... చారేసుకోబోయి పప్పేసుకున్నాను హరిహరీ ... కుక్క ఎత్తుకెళ్ళింది విస్తరాకూ ... అది గాని దొరికితే దాని నడ్డి కర్రతో సరీ సరీ ... అనే పాటకు అడుక్కుతినే గొంతుతో ఆలపించాలి". మంత్రగాడు చివరగా రంపం తీసుకొని "ఓ బి.గోపాలాయ నమః, ఓ రామ్ గోపాలాయర్మాయ నమః" అని పాతికసార్లు అరచి మేకపిల్ల గొంతును పరపరా కోయాలి. మంత్రగాడు కోశాడు. ఆ తర్వాత చెట్ల వ్రేళ్ళ భస్మంతో సిద్ధంగా ఉండాలి" చెబుతూ వెనక్కి తిరిగి చూసాడు.







ఓ అమ్మాయి వచ్చి అక్కడ నిల్చుంది. "ఈ భస్మం అమ్మాయి మీద వేసేస్తే చాలు! వశీకరణ పూర్తయినట్లే". అంటూ ఆ భస్మం ఆమెపై వేశాడు.

ఆ అమ్మాయి, అతని ముందు మోకాళ్ళపై కూర్చుంది.

"ఇక నుండీ నువ్వు నా వశం!" అన్నాడు.

ఆ అమ్మాయి తలూపింది.

ఇప్పటివరకు సి.డి ప్లేయర్‌లో– "అమ్మాయిని వశీకరణ ద్వారా ఎలా లొంగదీసుకోవాలి?!" అనే ప్రయోగాన్ని చూశారు డబ్బారెడ్డి అతని మిత్రుడు సర్వారావు.




ఆ సి.డి.ని కాశి నుండి డబ్బారెడ్డి మిత్రుడు పంపాడు.

"ఒరేయ్! ఎలాగైనా మనం అవన్నీ సంపాదించాలి. ఈ ప్రయోగం నేర్చుకుని నేను చేస్తాను. ఎలాగైనా సమతను ఈ ప్రయోగం ద్వారా నా వశం చేస్కోవాలి" అన్నాడు డబ్బారెడ్డి.

"ఒరేయ్! ఇది చూస్తుంటేనే భయంగా ఉంది వద్దురా, ఇవి మన వల్ల కావు" అన్నాడు సర్వారావు.

"నీ బొంద! చూశావుగా ... చాలా ఈజీ, పద!" అన్నాడు డబ్బారెడ్డి లేస్తూ. **(సశేషం)**

సర్వసుద్ధి లొవరాజు
9 4 9 1 1 5 3 6 1 1



# దొరగారికి దొంగ మనవి

**గత సంచికలో దొంగగార్లకు ఓ ఇంటి యాజమాని రాసిన లేఖకు ప్రత్యుత్తరం.**

**గౌ**రవనీయులైన దొర(యజమాని) గారికి, ప్రతినమస్కారం. మీ దయవల్ల మీలాంటి దొరల వల్ల మేము ఫుల్ హ్యాపీ. మా వల్ల కూడా మీరు కావల్సినంత అన్‌హ్యాపీగా ఉండాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

జనవరి మాసంలో హాస్యానందం ద్వారా మీరు అందించిన మీ 'దొంగ విన్నపాలు' అంటే అయ్‌మీన్ "దొంగ గారికి విన్నపం"లు మాకు అందాయి. మా పట్ల మీరు కుమ్మరించిన మీ అభిమానానికి మీ సువిశాల హృదయ దయకి తట్టుకోలేక రాష్ట్రంలో యావన్మంది దొంగలం అర్జెంటుగా ఓ మీటింగ్ పెట్టుకుని మరీ గొంతెండిపోయేలా ఆనందంతో ఏడ్చేశాం... మా పట్ల మీ సానుభూతికి, "ఔరా!" అని మా మూతుల మీద చేతులు వేసుకొని మరీ ఆశ్చర్యపోయాం.

ఇంటి యజమానులందరూ మీలా ఉంటే మా పని ఎంత సులువవుతుంది. అదేంటో గాని చాలా మందికి మేమంటే పళ్ళు రాళ్ళగొట్టేంత కోపం. మమ్మల్ని చూస్తే చాలు కొంపలు కాలిపోతే ఫైరింజన్ గంటలా "దొంగా...దొంగా!!" అని అరుస్తారు. అసలు నాకు తెలీకడుగుతున్నాను. మేము జేసిన నేరం ఏంటండి? అఫ్టాల్ దొంగతనమేగా!

అసలు దొంగతనం చేయని వాడెవడున్నాడీ లోకంలో చెప్పండీ! ప్రతివాడు ఏదో టైంలో దొంగతనం చెయ్యాల్సిందే. ఫరెగ్జాంపుల్-భర్త, భార్య అందాన్ని, చాకిరి(శ్రమ)ని దోచుకుంటాడు. భార్య, భర్త శాలరీని సంతోషాన్ని సంతోషంగా దోచుకుంటుంది...పేరెంట్స్ ర్యాంకలనీ, కోచింగ్‌లనీ పిల్లల బాల్యాన్ని దోచుకుంటారు. పిల్లలు ఫీజులని, పార్టీలని, పేరెంట్స్‌ని దోచుకుంటారు... ఇలా ఎన్నెన్ని చెప్పను.

సో... ఆల్ పీపుల్స్ ఆర్ తీవ్స్.

అందరూ దొంగలే. అలాంటి అందరినీ వదిలేసి కేవలం మమ్మల్నే దొంగలనడం ఎంత వరకు భావ్యం మహానుభావా! తప్పుకదూ! మానవ హక్కులను మర్డర్ చేసినట్లే కదూ!

పోనీయ్ లేండి. మీరన్నట్లే కానీయండి. మేం దొంగలమే. మేం చేసేది దొంగతనమే. కాని ఎందుకు చేస్తున్నాం. ఎవరి కోసం చేస్తున్నాం. దేశంకోసం కాదా?...దేశ సేవ కోసం... సౌభాగ్యం కోసం కాదా!... ఏంటలా చూస్తున్నారు. దొంగతనానికి దేశసేవకి సంబంధమేంటనా? ఎందుకు లేదు? బోలెడుంది. చెప్తాను చదవండి.

ఇప్పుడు మన న్యాయశాస్త్రం ఏమని శాసిస్తున్నది. మన కాన్‌స్టిట్యూషన్ ఏమని ఘోషిస్తుంది? సంపదలనేవి (అంటే డబ్బు, బంగారం లాంటివి) ఏ ఒక్కరి దగ్గరో ఫిక్స్‌డ్‌గా ఉండిపోకూడదు. అవి చేతులు మారుతూ ఉండాలి. లేకపోతే బ్లాకయిపోతాయి. అనగా నల్లగా అయిపోతాయన్నమాట. నల్లధనమంటే నేరమే కదా. రాజ్యాంగాన్ని తూట్లు పొడిచినట్లే కదా! ఈ ఘోర విపత్తు నుండి దేశాన్ని రక్షించేవాడెవ్వడు?





మారకపోతే మనిషికి విలువ... మారితేనే మనీకి విలువ! మీ దగ్గరున్న మనీ మాకి వ్వండి. మేం మారుస్తాం. అంటే మీరు ఇస్తారా? తన్ని తరిమేస్తారు. పోనీ మనకెందుకులే అని వదిలేద్దామా అంటే దేశం క్లిష్ట పరిస్థితులలో పడిపోతుందాయె. అందుకే మా కిష్టం లేకపోయినా దేశం పట్ల ప్రేమ వల్ల రాజ్యాంగం పట్ల గౌరవం వల్ల మీరు దోచుకున్న ధనాన్ని మేం దాచుకుంటున్నాం. సారీ... మీరు దాచుకున్న ధనాన్ని మేం దోచుకుంటున్నాం. మరి దీన్ని దేశసేవగా ఎందుకు పరిగణించరని నేను అడుగుతున్నాను.




మన పొలిటీషియన్స్ (కొంతమంది) మన తల రాతలు మార్చి కోట్లు దోచుకుంటే ఈ సేవని మీరేమంటారు? మేం జస్ట్ లక్షలు, వేలు దోచుకుంటే మాత్రం నేరం. వారికేమో పూల మాలలు, జైజై నాదాలు. మాకేమో చెరసాలలు. వీపు విమానం మోతలు. ఎంత దారుణమెంత దుర్మార్గమెంత దౌర్జన్యం. కలి చలిలా వణికిస్తోందనడానికి ఇంతకన్నా ఉదాహరణ ఏముంటుంది?

కాబట్టి ఓ యజమాని! దొంగతనం కూడా ఓ వృత్తేనయ్యా. వృత్తి ధర్మమే ఉత్తమ ధర్మం అని మీరే కదా అంటారు. మరెందుకయ్యా దొరికితే మక్కెలిరగ గొడతారు. అయినా ఈ రోజుల్లో దొంగతనం చేయడం అంత ఈజీ కాదయ్యా. తీగలు తీగలుగా పెరిగిపోయిన టెక్నాలజీ ఉన్న ఈరోజుల్లో దొంగతనం చేయడం, చేసినా దొరక్కుండా ఉండడం చాలా కష్టం. ఎన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ఎన్ని ప్లానులు వేయాలి. ఎంత ధైర్యం చాకచక్యం ఉండాలి. ఎంత సమయస్ఫూర్తి ఉండాలి. అలాంటి వాడిని మెచ్చుకోకుండా మెచ్చుకొని మేకతోలు కప్పకుండా తోలు ఊడేలా చావకొడతారా?... మీరు మనషులేనా?... మానవత్వం చచ్చిపోయిందా?... అని అడుగుతున్నాను.







అందుకే మా దొంగల సమావేశంలో కొన్ని నిర్ణయాలు తీసుకోవడం జరిగింది. మా డిమాండ్లలో కొన్ని- దొంగతనాన్ని ఒక ప్రొఫెషన్‌గా గుర్తించాలి. మమ్మల్ని 'దొంగవెధవ' అని అనకుండా 'దొంగగారు'అని రెస్పెక్ట్‌గా పిలవాలి. దొరికిన దొంగలకు ఏ విధమైన మానసిక, శారీరిక బాధలు కలుగకుండా చూడాలి. బ్యాంక్‌ల్లో ఏ.టి.ఎమ్‌లలో సి.సి.కెమేరాలు తీసేయాలి. దొంగలకవసరమైన తాళ్ళు, మాస్కులు, కత్తెరలు ఉచితంగా ఇవ్వాలి. వీలైతే ట్రైనింగ్ కాంప్‌లు కూడా నిర్వహించాలి. ఇంట్లో కుక్కలు పెంచడం నిషేధించాలి.

ఈ న్యాయమైన, ధర్మమైన డిమాడ్లతో అలుపెరుగని పోరాటం చేయాలని నిర్ణయించుకున్నాం. "ప్రపంచ దొంగల్లారా ఏకం కండి" అనే నినాదంతోముందుకెళ్ళాలని అనుకుంటున్నాము. అందుకు మీ సహకారాన్న మాకు అందిచాలని ఆకాంక్షిస్తున్నాము. **-కన్నాల కనకయ్య**, మాస్టర్ ఇన్ థీఫాలజీ




# సరదాగా ప్రేమ ముచ్చట్లు

**ఫిబ్రవరి-14 ప్రేమికుల రోజు సందర్భంగా స్పెషల్‌గా....**



**ప్రేమించేటప్పుడు ...**

అబ్బాయిలు, అమ్మాయిల 'అందానికి' పడిపోతారు.

అమ్మాయిలు, అబ్బాయిల 'మాటలకు' పడిపోతారు.

**అందుకే ...**

అమ్మాయిలు మేకప్పులు వాడతారు,

అబ్బాయిలు అబద్ధాలు ఆడతారు.

✦ గత ఇరవై ఏళ్ళలో పెళ్ళయిన వారిని ప్రశ్నిస్తూ, "మీది అరేంజ్‌డ్ మ్యారేజియా, లవ్ మేరేజియా?" అని అడిగితే ... 20% మంది మాత్రమే సూటిగా "మాది అరేంజ్‌డ్ పెళ్ళి"... "మాది ప్రేమ వివాహం" అని చెప్పారు.

మిగతా 80% మంది వారిది పెద్దలు కుదిర్చిన పెళ్ళి అయినప్పటికీ ... సమాధానంగా "హిహ్హిహ్హి... మాది అరేంజ్‌డ్ లవ్ మారేజ్" అని గాని, హిహ్హిహ్హి... పెద్దలు కుదిర్చారు. ఆ తర్వాత ప్రేమించాను. కాబట్టి రెండూనూ!" అని గానీ చెప్పారు.

దీని భావం ఏమిటంటే... గత ఇరవై ఏళ్ళలో మన సమాజంలో ప్రేమ వివాహాల సంఖ్య గణనీయంగా పెరగడం వల్ల ... "అర్రే ... నేను అనవసరంగా పెద్దలు కుదిర్చిన పెళ్ళి చేసుకున్నానే ... హుమ్ సరే చేసుకుంటే చేసుకున్నాను ... మాది లవ్ మ్యారేజ్ అని అని చెబితే పోలా! వినే వాళ్ళకు కాస్త కిక్కుంటుంది" అని వారి ఫీలింగ్.



✦ వేలంటైన్స్ డే రోజున అమెరికాలో మిలియన్ల కొద్దీ గ్రీటింగ్ కార్డులు ఎక్స్ఛేంజ్ అవుతుంటాయి. క్రిస్మస్ తర్వాత అత్యధికంగా అమెరికాలో అమ్ముడయ్యే గ్రీటింగ్స్ కార్డులు ఇవే!

✦ రిచర్డ్ క్యాడ్‌బరీ సృజనాత్మకంగా ఆలోచించి 1800వ సం॥లో ... హృదయాకారంలో ఉండే చాక్లెట్ బాక్సులను సృష్టించాడు. అవి వైలంటైన్స్‌డే రోజున రికార్డు స్థాయిలో అమ్ముడయ్యాయి. ఆ తర్వాత చాలామంది చాక్లెట్ సృష్టి కర్తలు, కంపెనీలు దీన్ని అనుసరించాయి.



✦ ప్రేమ అంటే ?...

1.బాధ, 2. గుడ్డిది, 3. జీవితం, 4. సమస్తం, 4.మత్తు, 5. ఆట, 6. అసత్యం, 7. సత్యం, 8. కొవ్వు, 9. కాలక్షేపం, 10. తెలీదు, 11. అందమైన భావం, 12. ఆలోచిస్తే.... వీటిలో మీ సమాధానం ఏదో ఆలోచించండి.

✦ అమ్మాయిల మూడ్ మార్చగలిగే వాక్యాలూ రెండే రెండు.

**ఒకటి -ఐలవ్‌యు,**

**రెండు - 50% డిస్కౌంట్" బోర్డు**



✦ ప్రేమ లేకపోతే నేను బ్రతుకలేను... అని చాలా మంది అంటుంటారు. కానీ ... ఆక్సిజన్ లేకపోతే ఐదు నిమిషాలు కూడా బ్రతక లేరు.

✦ ప్రేమలో ఒకరూల్ పాటించాలి. లేకపోతే కష్టం!

అబ్బాయిలు - మీరు ఓ అమ్మాయిని ప్రేమించాలంటే ...

**...ఆమె గురించి బాగా తెలుసుకోవాలి.**

అమ్మాయిలు - మీరు ఓ అబ్బాయి గురించి తెలుసుకోవాలంటే ...

**...అతడిని ప్రేమించాలి.**

కండ్లకుంట శరత్ చంద్ర



✦ అమ్మాయి తరపు వారిని పీడించి కట్నం తీసుకొని పెళ్ళి చేసుకున్న వారెవ్వరికీ... తమ భార్యలకు **'ఐలవ్‌యూ'** అని చెప్పే హక్కులేదు...సంసారాలు చేస్కో వచ్చు....పిల్లల్ని కనొచ్చు. కానీ "నేను నిన్ను ప్రేమిస్తున్నాను" అనే హక్కు మాత్రం లేదు.

సోక్రటీస్ శిష్యుడైన ప్లేటో మాటల్లో చెప్పాలంటే ... "వ్యాపారంలో ప్రేమ ఉండదు... ప్రేమలో వ్యాపారం ఉండదు"

ఓ ఉచిత సలహా విసరనా!?....మీరు మీ మామగారు లేదా అత్తగారి దగ్గరి నుండి తీసుకున్న కట్నాన్ని వాళ్ళ మొహాన పారేసి అప్పుడు దర్జాగా మీ ఆవిడ గారికి **'ఐలవ్‌యూ'** చెప్పండి.

✦ "నాకంటే నిన్ను ఈ ప్రపంచంలో గొప్పగా ప్రేమించే వాళ్ళెవ్వరూ లేరు!" అని మీ ప్రేయసి గాని, ప్రేమికుడు గాని అంటే నమ్మకండి. ఎందు కంటే ఈ ప్రపంచంలో తన ప్రాణం కంటే మిన్నగా ప్రేమించ గలిగేది 'కుక్క' మాత్రమే.

✦ పార్కులలో చెట్లమీద, పురావస్తు శిథిలాల మీద-ఫలానామె లవ్స్ ఫలానా వాడు" అని వారి వారి పేర్లు చెక్కుతుంటారు. ఇవి చదివినప్పుడల్లా అనిపిస్తుంది... ప్రేమికులు చిన్న సైజు కత్తుల్ని వెంయిన్‌టెయిన్ చేస్తుంటారా?.. అని !!

✦ **ప్రేమలు పలు రకాలు...**

వాటిలో కొన్ని సినీ ప్రేమలు, కొన్ని **మనీ** ప్రేమలు, కొన్ని **వేడి** ప్రేమలు, కొన్ని **దాడి** ప్రేమలు, కొన్ని **తిరుగుడు** ప్రేమలు, కొన్ని **విరుగుడు** ప్రేమలు, కొన్ని **జోరు** ప్రేమలు, కొన్ని **బోరు** ప్రేమలు.



✦ లవ్‌లో... ఫోన్లు ఎంత ప్రముఖమైన పాత్ర పోషిస్తాయో అందరికీ తెలుసు. చిత్రమైన సంగతేంటంటే....1876 వేలంటైన్స్‌డే రోజున ...అలెగ్జాండర్ గ్రాహంబెల్ తాను కనుగొన్న 'టెలిఫోన్'కు పేటెంట్ రిజిస్టర్ చేయించాడు. ❦









✦ అమ్మాయి తరపు వారిని పీడించి కట్నం తీసుకొని పెళ్ళి చేసుకున్న వారెవ్వరికీ... తమ భార్యలకు **'ఐలవ్‌యూ'** అని చెప్పే హక్కులేదు...సంసారాలు చేస్కో వచ్చు....పిల్లల్ని కనొచ్చు. కానీ "నేను నిన్ను ప్రేమిస్తున్నాను" అనే హక్కు మాత్రం లేదు.

సోక్రటీస్ శిష్యుడైన ప్లేటో మాటల్లో చెప్పాలంటే ... "వ్యాపారంలో ప్రేమ ఉండదు... ప్రేమలో వ్యాపారం ఉండదు"

ఓ ఉచిత సలహా విసరనా!?....మీరు మీ మాంగారు లేదా అత్తగారి దగ్గరి నుండి తీసుకున్న కట్నాన్ని వాళ్ళ మొహాన పారేసి అప్పుడు దర్జాగా మీ ఆవిడ గారికి **'ఐలవ్‌యూ'** చెప్పండి.

# ...మ ముచ్చట్లు



✦ "నాకంటే నిన్ను ఈ ప్రపంచంలో గొప్పగా ప్రేమించే వాళ్ళెవ్వరూ లేరు!" అని మీ ప్రేయసి గాని, ప్రేమికుడు గాని అంటే నమ్మకండి. ఎందుకంటే ఈ ప్రపంచంలో తన ప్రాణం కంటే మిన్నగా ప్రేమించ గలిగేది 'కుక్క' మాత్రమే.

✦ ప్రేమ లేకపోతే నేను బ్రతుకలేను... అని చాలా మంది అంటుంటారు. కానీ ... ఆక్సిజన్ లేకపోతే ఐదు నిమిషాలు కూడా బ్రతక లేరు.

✦ ప్రేమలో ఒకరూల్ పాటించాలి. లేకపోతే కష్టం!

అబ్బాయిలు - మీరు ఓ అమ్మాయిని ప్రేమించాలంటే ...

**...ఆమె గురించి బాగా తెలుసుకోవాలి.**

అమ్మాయిలు - మీరు ఓ అబ్బాయి గురించి తెలుసుకోవాలంటే ...

**...అతడిని ప్రేమించాలి.**

## కండ్లకుంట శరత్ చంద్ర

✦ పార్కులలో చెట్లమీద, పురావస్తు శిథిలాల మీద-ఫలానామె లవ్స్ ఫలానా వాడు" అని వారి వారి పేర్లు చెక్కుతుంటారు. ఇవి చదివినప్పుడల్లా అనిపిస్తుంది... ప్రేమికులు చిన్న సైజు కత్తుల్ని మెయిన్‌టెయిన్ చేస్తుంటారా?.. అని !!

✦ **ప్రేమలు పలు రకాలు...**

వాటిలో కొన్ని **సినీ** ప్రేమలు, కొన్ని **మనీ** ప్రేమలు, కొన్ని **వేడి** ప్రేమలు, కొన్ని **దాడి** ప్రేమలు, కొన్ని **తిరుగుడు** ప్రేమలు, కొన్ని **విరుగుడు** ప్రేమలు, కొన్ని **జోరు** ప్రేమలు, కొన్ని **బోరు** ప్రేమలు.



✦ లవ్‌లో... ఫోన్లు ఎంత ప్రముఖమైన పాత్ర పోషిస్తాయో అందరికీ తెలుసు. చిత్రమైన సంగతేంటంటే....1876 వేలంటాన్స్‌డే రోజున ...అలెగ్జాండర్ గ్రహెంబెల్ తాను కనుగొన్న 'టెలిఫోన్'కు పేటెంట్ రిజిష్టర్ చేయించాడు.

ధారావాహిక -2

# జయదేవ్ వ్యంగ్య చిత్ర విన్యాసం

డాక్టర్ రావెళ్ళ

## ప్రేమ కార్టూన్లు

**ప్రేమ సినిమా విడుదలైతే ఇరవై ఏళ్ళ పిల్లలు మొదలుకొని అరవై ఏళ్ళ ముసలివారిదాకా సినిమా చూడ్డానికి క్యూ కడతారు. ప్రేమలో ఉన్న తీపి అలాంటిది మరి!**

రోజులు మారాయి...సాంప్రదాయాలకు తలొగ్గి ఆడవాళ్ళు తలొంచుకుని నడవడం ఒకప్పటిమాట. ఇప్పుడు తలెత్తుకు తిరగడమే కాదు... చుట్టూ ఎవరున్నారో కూడా గమనిస్తున్నారు. ఇది నిజంగా చైతన్యమే!

మగవారితో పాటు ఏ విషయంలోనైనా మగువలు సమానమే! కాస్త ముందూ వెనుకగా ప్రేమలో పడని మనిషంటూ ఉండదు. 'ఛీ! ఛీ!!... నాకసలు ప్రేమంటే అస్సలు గిట్టదని' ఎవరన్నా దబాయించినా వారి 'జీన్సే' ప్రేమించమని ప్రోత్సాహిస్తాయి.




















లోకంలో ఎన్ని రకాల ప్రేమలో!... వన్ వే లవ్‌లూ...టూ వే లవ్‌లూ... ఇప్పుడైతే ట్రయాంగిల్ లవ్‌లూ... ప్రేమించిన అమ్మాయి కాదని ఇష్టంలేని పెళ్ళి చేసినప్పుడు జరిగే సంఘటనలు... ఒక వేళ పెళ్ళి చేశారే అనుకోండీ... పెళ్ళైన తరువాత పాత చరిత్రని మరచిపోయి... కట్టుకున్న వారిని చచ్చినట్లు ప్రేమించి తీరాలి. ఆ ప్రేమ 'మత్తులో' మునిగిపోయి, గత చరిత్రనంతా జీవిత భాగస్వామికి అచ్చు గుద్దినట్లు కథలు కథలుగా 'కక్కార'నుకోండి... పరిస్థితులు తారుమారౌతాయి.

ప్రేమించిన అమ్మాయిని మోసం చేయడాలూ... మోసం చేసిన వ్యక్తిని 'అన్న'లతో బెదిరించడం... గుడంటే గిట్టని యువతులు కూడా రోజూ ఠంచన్‌గా గుడికెళ్ళోస్తానంటూ పూలబుట్ట తీసుకుని బయలుదేరితే ఎవరికి మాత్రం అనుమానం రాకుండా ఉంటుంది చెప్పండి!?

పార్కులు... హోటళ్ళూ పోయి ప్రస్తుతం పబ్బులొచ్చాయి. ప్రేమికుల చిత్ర విచిత్ర వేషాలు... వందల పేజీల ప్రేమలేఖలు రాయడం... రక్తంతో ప్రేమలేఖలు రాయడం... ప్రేమలో ఎన్ని కోణాలో!?...

జయదేవ్‌గారి కార్టూన్లలో ప్రేమకు సంబంధించిన కార్టూన్లు అనేకం ఉన్నాయి. ఆ వందల కార్టూన్లలో కొన్ని ప్రేమకార్టూన్లను చూడండి.

ఫిబ్రవరి 14 ప్రేమికుల రోజు సందర్భంగా ఈ ప్రేమ కార్టూన్లు హాస్యానందం పాఠకులకు ప్రేమతో....

**(వచ్చే సంచికలో 'రాజకీయ కార్టూన్లు')**

**టి.ఎస్.ఆర్.కె.గాంధి**



# నే వున్నాను కదా...!

**"నమస్తే డాక్టర్"**

**గజిటెడ్ ఆఫీసర్లూ... డాక్టర్లూ.. ఇంజనీర్లూ...తమ క్రింది స్థాయి వాళ్ళు నమస్కరించినప్పుడు ప్రతి నమస్కారం చేయకూడదు. కదలీ కదలనట్టుగా తలపంకించడమో... శబ్దం రాకుండా 'వూ!' అని మూలగడమో చేయాలి.**

**అక్షరాలా అదే చేశాడు డాక్టరు.**

'వూ' అనేసి 'చెప్పండి' అని కూడా అన్నాడు.

చూపుల్తోనే కూర్చోమన్నట్లు ప్రక్కనున్న స్టూలుని చూపించాడు.

"మోషన్సండి...రాత్రి నాలుగుసార్లు... ఉదయం లేచిన దగ్గర్నుంచీ మరో నాలుగు సార్లు... వారనికి సరిపడా... వూ!...చెప్పేను.

"ఇహనేం వచ్చేవారం మానెయ్యండి" కిసుక్కున నవ్వేడు డాక్టరు.

నేను బిత్తరపోయేను.

ఇదేవన్నా శెలవలముందు పిల్లలకిచ్చే హోం వర్కా! గబుక్కున చేసేసి... హమ్మయ్య... ఇక చేసేపన్లేదులే అనుకుందుకు.

"జోక్' నవ్వేడు డాక్టరు.

నాకు నొప్పులయితే... తనకు జోక్‌లా వుంది... తప్పదు...అనుకున్నాను.

బలవంతంగా నవ్వేను.

"షుగరుందా?" అడిగేడు డాక్టరు.

"ఆ... ఇంట్లో వుందండీ" చెప్పాను.

"ఇంట్లో కాదయ్యా... వంట్లో!"

"ఏమో...నాకెలా తెలుస్తుందండీ" చెప్పాను.

ఓ కాగితం తీసి ఏవేవో రాసి నా చేతికిస్తూ అడిగేడు

"బి.పీ...."

"తెలీదండీ"

మరోకాగితం మీద మరేదోరాసి అదీ నా చేతికిచ్చాడు.

"ఇ.సి.జీ., హెచ్.బీ., లిపిడ్ ప్రొఫైల్., మోషన్‌టెస్ట్..." అతను చదువుకుంటూ వెళుతున్నాడు.

నేను నోరు తెరుచుకుని వింటూండిపోయేను.

SANGRAM

"త్వరగా ఆ పరీక్షలన్నీ చేయించుకురా... దానిలో రాసిన చోటుకే వెళ్ళు లేకపోతే తేడా లోస్తాయి."

"ఏం తేడాలండీ" అడిగేను.

"రిపోర్టులయ్యా!... రిపోర్టులు తేడాలొస్తే డేంజరు కాదూ?"

"ఎవరికండీ?"

"డేంజర్ నీకేనయ్యా! వెళ్ళూ...త్వరగా వచ్చే సెయ్. లేకపోతే మోషన్స్ తగ్గినా తగ్గచ్చు"

గబగబా బయటకు పరుగెత్తను.

ఆ పరీక్షలన్నీ చేయించుకొని, రెండు వేలు వదిలించుకున్నాక గానీ ఆ డాక్టరన్నది నాకర్ధం కాలేదు.

మోషన్స్ తగ్గినా తగ్గచ్చు...

అదేమంటే 'జోక్' అని నవ్వినా నవ్వుతాడు.




కానీయ్.. నీళ్ళల్లో మునిగి చలికి వణకడమూ... రోట్లో తలపెట్టి పోటుకు భయపడడమూ ఎంత వరకూ సబబు... నన్ను నేనే సమాధానపరుచుకున్నాను.

రిపోర్టులతో డాక్టరుగారిని కలిసాను.

"వెరీగుడ్...వచ్చేవా?" అన్నాడు.

రిపోర్ట్సు అన్నింటినీ మార్చి... మార్చి... చూసాడు..

నాకు ఏమేం జబ్బులున్నాయంటాడో... ఆందోళనగా... డాక్టరు గారి ఫీలింగ్స్ చదివేందుకు ప్రయత్నించసాగేను.

'ప్చ్' పెదవి విరిచాడు.

'లాభంలేదు' సన్నగా గొణిగాడు.

నాలో ఆదుర్దా పెరుగుతోంది.

"లేదయ్యా!... ఒక్క జబ్బులేదు... షుగరు లేదు... బి.పీ.లేదు.. హెచ్.డి.యల్... ఎల్‌డి. ఎల్...హెచ్.బీ.. అన్ని నార్మల్‌గానే వున్నాయ్." నిరాశగా చెప్పాడు.







నాకు చాలా సంతోషంగావుంది...రెండు వేలు వదిలినందుకు విచారంగానూ వుంది.

"రెండు వేలు పోయినయ్ సర్... రెండు వేలు" చెప్పాను.

"నేనెవరితో చెప్పుకోనయ్యా... నాకెన్ని వేలు పోయుంటా యంటావు" చురచురా చూసాడు.

పొడుగాటి కాగితం మీద దాదాపు పది రకాల మాత్రలూ, గొట్టాలూ రాసిచ్చాడు. ఓ పదిరోజులు వాడమన్నాడు. ఆనక వుంటే రమ్మన్నాడు.

"ఎవరుంటే సర్..." అడిగేను.

"నువు కాదయ్యా!... నీ జబ్బు ... మోషన్స్ అన్నావు కదా..."

"సరే, ఇన్ని రకాలు అవసరమంటారా..." భయం భయంగానే అడిగాను.

"నేనా డాక్టర్ని.. నువ్వా ... హు ..." అని హుంకరించాడు.

"మీరే !" గొణిగాను.

"ఇవన్నీ ఎందుకని కదా అడిగేవు... ఇదిగో ఇదీ ఏంటీబయోటిక్ అన్నమాట...ఇది మోషన్స్ తగ్గేందుకు... అందునా ఇన్నిసార్లు వెళ్ళడమంటే బాధగానే వుంటుంది గదా... అందుకన్నమాట ఇవీ నొప్పి తగ్గేందుకు.. రాత్రి సరిగా నిద్రవుండదు కదా ... నిద్ర పట్టేందుకు ఇవీ... నీరసంగా కూడా వుంటుంది కదా... నీరసం తగ్గేందుకు బలానికి ఇవన్నమాట.

ఇదిగో చివర్న రాశాను చూడూ... నువు ఇన్ని రకాల బిళ్ళలు వాడుతున్నావు కదా, సైడ్ ఎఫెక్ట్‌లేవీ రాకుండానన్న మాట ఆఖరున రాసినవి. అప్పటికి చాలా వరకు తగ్గించి రాశాను. బయటెక్కడ కొనమాకు మన హాస్పిటల్ ఫార్మాసిలోనే కొను. ఏం!..."

కొద్దిసేపు ఊపిరి పీల్చుకోవడానికి ఆగాడు.

"కోర్సు పూర్తిగా వాడాలి మరి. పది రోజుల తర్వాత గుణం కనపడలేదనుకో... అప్పుడు మరిన్ని పరీక్షలు చేసి మందులు మార్చి రాసిద్దాం... ఏం దిగులు పడకు... నే వున్నా కదా!" చెప్పి పూర్తిగా వూపిరి పీల్చుకున్నాడు.

గటగటా గ్లాసెడు నీళ్ళు తాగేడు.

బయట కొచ్చి నేను రెండు గ్లాసులు నీళ్ళు తాగేను.

హాస్పిటల్ బిల్డింగ్ వంకోసారి చూశాను.

నాలుగో అంతస్థు కన్‌స్ట్రక్షన్ సగంలో ఆగి వుంది.

నేనో నిర్ణయానికి కొచ్చేను.

ఇన్ని రకాల బిళ్ళలు వాడి చచ్చే కన్నా వాడకుండా చావడమే మేలనిపించింది.

అందుకే మాత్రలు కొనడం మానేసాను.

విచిత్రంగా రెండోరోజుకు మోషన్స్ పూర్తిగా తగ్గిపోయాయి.

హిపిప్..హుర్రే.






ప్రముఖ కార్టూనిస్ట్ **బి.హరి వెంకటరమణ (హరి)** కి సేవారంగంలో భారతప్రభుత్వ యువజన వ్యవహారాలు, క్రీడల మంత్రిత్వశాఖ అందించే అత్యున్నత పురస్కారం **జాతీయ యువజన అవార్డు -2013** లభించింది.

గత కొన్ని సంవత్సరాలుగా ఆయన యువతకు ఉపాధి కల్పన, పర్యావరణ పరిరక్షణ, ప్రభుత్వ పథకాలపై విస్తృత ప్రచారం వంటి అంశాలలో విశేష కృషి చేసారు. పర్యావరణం, ఇతర సామాజిక అంశాలపై కొన్ని లఘుచిత్రాలు సైతం రూపొందించారు. స్వామి వివేకానంద జయంతి సందర్భంగా ప్రభుత్వం ఈ ఏడు పంజాబ్‌లోని లుధియానాలో కేంద్ర యువజన వ్యవహారాల శాఖామంత్రి శ్రీ జితేంద్రసింగ్ చేతులమీదుగా ఈ అవార్డును అందజేసారు. అవార్డు కింద హరికి నలభైవేల రూపాయల నగదు బహుమతి, వెండిపతకం, ఆయన చేసిన కృషిని వివరిస్తూ ప్రత్యేక సావనీర్‌లో హిందీ, మరియు ఇంగ్లీషు భాషలలో ప్రచురణ చేసారు.

1992 నుంచి కార్టూన్లు వేస్తున్న హరి, కొంతకాలం పత్రికలలో పొలిటికల్ కార్టూనిస్టుగా, హైదరాబాద్ డేటాక్వెస్ట్‌లో యానిమేటర్‌గా పనిచేసారు. 2007 నుంచి ధరణి సంస్థ ద్వారా పలు కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రస్తుతం ఫ్రీలాన్స్ పొలిటికల్ కార్టూనిస్టుగా ఉంటూ విశాఖలో పలు ప్రాజెక్టులను చేపట్టారు.

విశాఖకార్టూనిస్టులసంఘం (వికాసం) వ్యవస్థాపక కన్వీనర్‌గా గత పదిహేను సంవత్సరాలుగా బాలలకు కార్టూన్లపోటీలు, ఉచిత శిక్షణ, కార్టూన్ల ప్రదర్శన ఏర్పాటు చేస్తున్నారు.

హాస్యానందం కుటుంబసభ్యుడైన హరి మరిన్ని ఉన్నత శిఖరాలు అందుకోవాలని హాస్యానందం కోరుకుంటుంది.



## గంగాధర్ వడ్లమన్నాటి

# ఫన్ పంచ్!



మొగుడ్స్... పెళ్ళామ్స్... మధ్యలో నవ్వుల్స్!

## మూడుముళ్ళ పరిష్కారం

"ఒప్పుకున్నానే నల్లకుండపెంకు మొహం దానా! ఒక్కదానివే నాకూ, మా నాన్నకి, మనిద్దరి పిల్లలకి అన్ని సమకూర్చి ఇంటి పని, వంట పని, గంట పని (పూజా, పునఃస్కారం) చేసుకోవాలంటే కష్టంగానే ఉంటుంది మరి. అందుకే కదా పని మనుషులు కావాలి అని పేపర్లో కూడా వేయించా. అయినా సరే ఎవరూ రాలేదు. ఇది వరకు వచ్చిన వారిని నువ్వు మెచ్చలేదు. దాంతో వారు నొచ్చుకొని వెళ్ళిపోయారు. అవునా?" అడిగాడి మధు చిట పటలాడిపోతూ.

"ఔననుకోండి. కాని నేనేం చేయను. ఒకతి పనెక్కువ అని రోజంతా నసుగుతూ ఉం టుంది. ఒకతి ఒకరోజు వస్తే రెండు రోజులు సెలవు పెడుతుంది. మరొకతి పొగరు, వగరూ చూపిస్తుంది. అందుకే నేను ఓ నిర్ణయానికి వచ్చాను. మా పిన్ని వాళ్ళమ్మాయి రాధ చెప్పి నట్టే నేనూ చేయాలనే నిర్ణయానికి వచ్చాను" చెప్పిందామె.

"రాధ చేసినట్టా?... ఇంతకీ ఆ రాధ బాధేం టి? అది ఏంచేసి తగలడింది!..." అడిగాడు ఇంకా మంటగా.

"వాళ్ళ కుటుంబంలో అత్తమామలతో పాటు, బంధువులు తాకిడి కూడా ఎక్కువట. అందులోనూ వాళ్ళత్త మహిళామండలి ప్రెసి డెంటు, వాళ్ళు మామయ్య రచయితా కావ డంతో ఇంటికి వచ్చిపోయేవారి సంఖ్య కూడా ఎక్కువేనట. అందుకే ఇంటి పని భరించలేక పని మనుషులతో పడలేక, వాళ్ళాయన్ని రెండో పెళ్ళికి ఒప్పించి తనకి తెల్సిన బంధువుల్లో అణుకువ గల ఓ అమ్మాయితో పెళ్ళి చేసేసిందట. దాంతో ఇప్పుడు అది హాయిగా సీరియల్స్ చూస్తూ షాపింగ్స్ చేస్తూ ఎంజాయ్ చేస్తోందట.

ఆమె మాటలు విన్న మధు ముఖంలో ఒక్కసారిగా నవ్వు తొంగి మరీ చూసింది.

ఆనందంగా "ఆ ఈ ఐడియా బావుంది. నాకూ కట్నం వద్దు. అమ్మాయి నీలా అస్సలు అందంగా లేకపోయినా పర్లేదు. కాని మాడు మొహం పెట్టుకొని ఉండకూడదు..." అని మధు మరేదో అనేంతలో ....

"ఆపండి. నేను మీరు అనుకున్నట్లు ఆలో చించలేదు.

"అంటే?..."

"ఏముంది!... ఇంట్లోకి ఇంకో ఆడ మనిషి కావాలి. నా ఇంటి పనుల్లో భాగం పంచు కోవాలి. దానికి మీరే పెళ్ళి చేసుకోనవసరం లేదు. మీ నాన్నగారికి చేయండి చాలు" చెప్పింది ఉత్సాహంగా.

"ఒసేవ్! ఒసేవ్!! కళ్ళుపోతాయ్. ఆయన మా నాన్న. మా అమ్మ మందు తాగి చనిపోతే నన్ను కంటికి లెన్స్‌లా కాపాడి పెంచారు." చెప్పాడు మధు.

"అంటే... మీ అమ్మగారికి మందు అల వాటు ఉండేదా?

"మందంటే నువ్వనుకుంటున్న మందు కాదు పురుగుల మందు. మా నాన్న సీరియల్స్ చూడొద్దన్నాడని పురుగుల మందు తాగిందిలే. అయినా మా నాన్నకి ఓల్డేజ్ హోం వయసులో పెళ్ళేంటి నా తలకాయ్." అడిగాడు మధు.

"ఏమో!... అదంతా నాకు తెలీదు. దూరపు చుట్టం ఒకామె ఉంది. వరసకి అత్తయ్య అవు తుంది. మొగుడ్ని చంపి జైలుకెళ్ళి ఈ మధ్యే బయటకి వచ్చింది. చాలా పనిమంతురాలు. జైల్లో తన పనికి మెచ్చి శిక్షాకాలం కూడా తగ్గించారు... కనుక మీరు మామయ్యని పెళ్ళికి ఒప్పించండి. మిగతాది నేను చూసు కుంటాను." అని ఆమె ఉత్సాహంగా చెప్తూండ గానే భయంగా హాల్లోకి నడచి వచ్చి మధు, అతని తండ్రి వంకా, లలిత వంకా మార్చి, మార్చి వంక దీనంగా చూస్తుండిపోయాడు.









సీరియల్

**"అది తప్పు ఇంకేమిటి నా బొంద అడిగేది?" ఆ మేడమీంచి దూకేస్తావా? సముద్రంలో మునుగుతావా? నాలుగు బ్లేడ్లు కరకరమని నమిలేస్తావా? ఇలాంటి కోరికలేమైనా కోరానా నిన్ను?... ఆ ఫోటోలో నున్న ప్రక్కనున్న జంట ఎవరో తెలుసుకోవాలనుకున్నా... అసలు నువ్వు మీ అమ్మానాన్నల బిడ్డవా? లేక ఏ చెత్త కుండీ వారసుడివా తెలుసుకోవాలని నేనారాట పడుతోంటే నన్నర్థం చేసుకోకుండా, నాకు సహకరించకపోగా... ప్రతిపనికీ అడ్డం చెబుతున్నావు. నీవిలా అడ్డు మాట్లాడేకొద్దీ నాకు నీమీద అనుమానం ఇంకా ఎక్కువౌతోంది... నన్ను భరించటం నీవల్ల కాదు నిన్ను భరించటం నావల్ల కాదు... నస వద్దు... ఎవరిదారి వాళ్ళు చూసుకుందాం పద" అంది కోపంగా లేస్తూ.**

"అమ్మో! శ్రీవల్లీ! నీకో నమస్కారం. నా వీక్‌నెస్‌మీద దెబ్బ కొట్టి సాధించుకుంటున్నావు. పద తల్లీ! నీవు చెప్పినట్టే వింటాను" అన్నాడు లెంపలేసుకుంటూ.

ముసిముసిగా నవ్వుతూ "ఉదయం ఎన్ని గంటలకు బయల్దేరుదాం?" అంది శ్రీవల్లి.

"ఉదయం ఏడు గంటలకు బస్సుంది. ఈ రాత్రినించే బస్టాండులో మకాం వేద్దామా?... వేళకు బస్సందుకోవచ్చు" అన్నాడు వెటకారంగా సుబ్బారావు.

✦✦✦

"అదేమిటండీ కళావతీ! మీ అమ్మగారు మరీ అంతలా కేకలేశారు ఫోన్లోనే" కాల్చిన మొక్కజొన్న కండెలు కళావతికిస్తూ అన్నాడు హనుమంతు.

"ఇలా ఈ బెంచీమీద కూర్చుందాం రండి... ఏమిటన్నారు మా అమ్మ సంగతా? ఆవిడంతే ముక్కుసూటిగా మాట్లాడుతుంది" అంది కళావతి మొక్కజొన్న కండెను తింటూ.

"ముక్కుసూటిగా మాట్లాడుతోందని మీరనుకుంటున్నారు. ముక్కు మొహం కూడా పగలకొడుతుందని నేననుకుంటున్నాను."



**జరిగిన కథ:** చిన్నప్పుడు సుబ్బారావుతో ఒకజంట ఫోటో చూస్తుంది శ్రీవల్లి. వాళ్ళెవరో ఇంట్లో వాళ్ళకెవరికీ తెలియదంటారు. ఎవరికీ తెలియని ఆ ఫొటోలోని వ్యక్తుల గురించి తెలుసుకోవడానికి సుబ్బారావు బంధువులందరినీ కలవాలనుకుంటుంది శ్రీవల్లి. సుబ్బారావు స్నేహితుడు హనుమంతు ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకుని నానా పాట్లు పడుతుంటాడు. **-ఇక చదవండి**

"అది సరే... మీ ప్రోగ్రెస్ ఎంతవరకొచ్చింది?"

"నా బొందప్రోగ్రెస్ ఆ దేవేంద్రగాడు, ఆర్తి ముసల్ది ఇక్కడ ప్రేమించటం నేర్పబడును అన్న బోర్డు తీసేసి ఇక్కడ రక్తం పీల్చబడును అని వేసుకుంటే సరిపోతుంది."

"అదేంటండీ అంత మాటన్నారు?"

"ఇంకెలా అనమంటారు? మిమ్మల్ని పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకోలేదని మీరు నా మీద కక్ష గట్టి అనుకూల శత్రువుగా వ్యవహరిస్తూ దేవేంద్రనూ, ఆర్తినీ పరిచయం చేసినట్టున్నారు."

"అలాగా పోన్లేండి!.. ఇప్పటికైనా తెలుసుకున్నారు. నన్ను క్షమించండి. మీరిలా అపార్థం చేసుకుని హర్ట్ అవుతారనుకోలేదు. దేవేంద్ర ఆర్తి చాలామందిని ప్రేమికులుగా తయారు చేశారని విని, చూసి తెలుసుకున్న తర్వాతే మిమ్మల్ని తీసికెళ్ళాను. ప్చ్! పాపం మీకా యోగం వున్నట్లు లేదు. సారీ..." అంది కళావతి దిగులుగా మొహం పెట్టి.

కాసేపు ఇద్దరిమధ్య నిశ్శబ్దం తాండవించింది. చాలాసేపటి వరకు హనుమంతు నోరు విప్పలేదు.

"ఏమిటంతలా ఆలోచిస్తున్నారు? ఎవరితోనైనా ప్రేమలో పడ్డారా? సారీ, ఎందుకలా అడిగానంటే ప్రేమలో పడ్డవాళ్ళు ఎక్కువ సమయం నిశ్శబ్దంగా గడుపుతారట. వందల మధ్యలో వున్నా ఒంటరిగా ఫీలవుతారట. ఎక్కడో చదివాను" అంది కళావతి.

"కనిపించిన అమ్మాయిల్నందర్నీ నేను



ప్రేమిస్తే సరిపోతుందా? వాళ్ళూ లవ్ చేయాలి గదా. మా వీధిలో ఓ అమ్మాయి అందంగా వుంది. ఆ అమ్మాయితో ప్రేమ వ్యవహారం నడిపేదెలాగో చెప్పి ఏడవండని ముసలి నక్కలను సలహా అడిగాను."

"వెరీగుడ్!... సలహా చెప్పారా?"

"ఆహా చెప్పారు... వానొస్తున్నా వాళ్ళింటి ముందు నిలబడితే... తెల్లారి ఆ పిల్ల చూసి నాతో ఐ లవ్ యు చెబుతుంది అన్నారు."

"మంచి సలహా! తెలుగు సినిమాల్లో హీరోలందరూ ఇలాగే చేసి సక్సెస్ అయ్యారు."

"నేనూ సక్సెస్ అవుదామనే నిలబడ్డాను."

"వర్షం వచ్చిందా?"

"కరువుతో చస్తుంటే వర్షమెక్కడ? రాత్రి రెండు గంటలవరకు వాళ్ళింటి వేపే చూస్తూ దోమలు రక్తం త్రాగుతున్నా సహనంతో నిలబడ్డా.... మరో నాలుగ్గంటలుంటే సక్సెస్ అయ్యేది"

"అంతలో ఏమయ్యింది?"

"పహరా కొచ్చిన పోలీసు జీపు వచ్చి నన్నెత్తుకుని వెళ్ళి బొక్కలో తోశారు. మక్కెలిరగదన్నకముందే, నా నా చావు చచ్చి వాళ్ళతో వీళ్ళతో ఫోన్లు పోలీసులకు చేయించి బయట పడ్డాను. చావుతప్పి కన్ను లొట్టపోయినంత పనయింది."

"చ్చు! చ్చు!! చ్చు!!!... ఎంతపని జరిగింది. ఇంకోరోజు వర్షం చూసుకుని నిలబడండి. వర్షం వస్తే పోలీసు జీపు రాకపోవచ్చు" క్రీగంట చూస్తూ అంది కళావతి.

"పోలీసు జీపు రాకపోవచ్చు కానీ నేను పడిపోతే ఎక్కించుకెళ్ళటానికి అంబులెన్సు మాత్రం కచ్చితంగా వస్తుంది..." కచ్చగా అన్నాడు హనుమంతు.

"అప్పుడు తప్పకుండా ఆ అమ్మాయికి మీ మీద జాలి... ఆ తర్వాత ప్రేమ కలిగి మీ ఆశయం సిద్ధించవచ్చు కదా!"

"అంత రిస్కు నేను తీసుకోలేనులెండి... అసలే ఈ రోజుల్లో హాస్పిటల్స్ నరక కూపాలయ్యాయి. అంబులెన్సులో తీసికెళ్ళిన నన్ను నానా రకలా టెస్టులు చేసి చివరికి ఏ మందు ల్లేని రోగమో నాకొచ్చిందని డిక్లేర్ చేసినా చేస్తారు. అప్పుడు ప్రేమసంగతి దేవుడెరుగు. దోమకూడా నామీద వాలటానికి భయపడుతుంది" అన్నాడు హనుమంతు.

"అయితే మరి మీరు ప్రేమించాలన్న ఆశయం సిద్ధించేదెలా? మీరిలా ప్రేమకు నోచుకోక... అడవిలో ఎండిన మానులా... నిరుపయోగంగా పడిన లైటు స్తంభంలాగా..."

"ఆగండి! ఆగండి!!... మీ కళ్ళకన్నీ చెత్తవస్తువులే కనిపిస్తున్నట్టుంది... కవిత్వం పొంగుకొచ్చేస్తుంది" అన్నాడు పళ్ళబిగువున కోపాన్ని అణచుకుంటూ.

"సారీ... సారీ! మరోసారి దేవేంద్ర, ఆర్తిల సలహా తీసుకోండి" అంది నవ్వు దాచుకుంటూ కళావతి.

✦✦✦

సుబ్బారావు రెండో అక్కపేరు మీరాబాయి. ఆమె భర్తపేరు వెంకోజీ. మీరాబాయికి ఇద్దరు పిల్లలు. ఒకబ్బాయి, ఒకమ్మాయి.




వెంకోజీ లెక్కల మాష్టారుగా పనిచేస్తున్నారు. అబ్బాయి టెన్త్... అమ్మాయి ఇంటర్ చదువుతున్నారు. మీరాబాయికి భక్తితో పాటు శుచి...మడి...విపరీతంగా ఆచరించి అందర్నీ ఇబ్బంది పెడుతూ వుంటుంది. ఆమెకు దేవుడి పట్ల ఎంత విశ్వాసమో... ఆమె భర్తకు అందులో పైసా భాగం కూడా లేదు. ఆమె మాట్లాడే ప్రతి మాటనీ... చేసే ప్రతి పనిని పూచికపుల్ల సమానంగా తీసిపారేసి తేలిగ్గా మాట్లాడుతుంటాడు. అతనలా ప్రవర్తించటం వల్ల ఆమె మారకపోగా ఇంకా మొండిగా చాదస్తంగా తయారయింది.

సుబ్బారావు, శ్రీవల్లి మీరాబాయి ఇంటి కాలింగ్ బెల్ నొక్కారు.

మీరాబాయి పరిగెత్తుకుంటూ వచ్చి తలుపు తీసి "హాఁ, నువ్వట్రా సుబ్బుడూ? ఈ పిల్లేనా నువ్వు ప్రేమించింది. కాస్త రంగు తక్కువైనా మొహం కళగా వుందిలే. రండి... రండి! ఆగండాగండి ఆ లగేజి ఆ ప్రక్కన పెట్టి అదిగో ఆ బకెట్లో నీళ్ళున్నాయి. కాళ్ళు కడుక్కుని లోపలికి రండి" అంది.

సుబ్బారావు, శ్రీవల్లి కాళ్ళు కడుక్కుని లోపలికి రాబోతుండగా–

"ఆగండాగండి!" అంటూ... ఒక ప్లాస్టిక్ చెంబు, వేపాకుమండలు పట్టుకొచ్చి... చెంబులో వేపాకు మండల్ని ముంచి ఇద్దరి తలమీద చిలకరించింది.

గప్పున వాసన కొట్టింది.

"అక్కా! ఏమిటే ఈ కంపు?" అన్నాడు విసుగ్గా సుబ్బారావు.

"అలా అనకూడదురా సుబ్బుడూ. ఆవు పంచితము ప్రోక్షించాను. బస్సులో ఆటోలో ఎవరెవర్నో ముట్టుకుని వచ్చుంటారు కదా. ఆవు పంచితం ప్రోక్షించుకుంటే దోషముండదు. ఈ మధ్య ఆవులు ఇటుగా రావటం లేదు. ఇది నెలరోజుల క్రిందటిది. అందుకే కాస్త వాసన వస్తోంది. ఏమనుకోకమ్మాయ్! ఇప్పుడు రండి లోపలికి" అంటూ ఆహ్వానించింది.

శ్రీవల్లి సుబ్బారావు మొహం వేపు చూసింది.

"చెబితే విన్నావా? అప్పుడే ఏముంది... ఇంకా చూద్దువుగాని పద" మీరాబాయి చూడకుండా శ్రీవల్లితో గుసగుసలాడాడు.

హాల్లో ఓ కుర్చీలో కూలబడబోతూ "అక్కా! ఓ కప్పు కాఫీ ఇచ్చి పుణ్యం గట్టుకోవే తలపగిలి పోతోంది" అన్నాడు సుబ్బారావు.

"అలాగే కానీ నువ్వక్కడ కూర్చోకు. ఇద్దరూ ఇలా రండి" అంది.

సుబ్బారావు నీరుగారిపోయి "ఎక్కడికమ్మా తల్లీ!" అన్నాడు.

"ఇలా రండి చెబుతాను" అంటూ ఇద్దర్నీ దేవుడి గదిలోకి తీసుకెళ్ళి ఇద్దర్నీ దేవుడు ముందు కూర్చోమంది. ఇద్దరికీ దేవుడి ముందున్న కుంకుమబొట్టు పెట్టింది... విభూతి పెట్టింది... తనూ వాళ్ళ ప్రక్కనే కూర్చుని కళ్ళు మూసుకుని ప్రార్థించింది. అలా దాదాపు పది నిమిషాలు లేవనియ్యలేదు.

సుబ్బారావుకు దేవుడంటే పెద్దగా నమ్మకం లేదు. వాళ్ళమ్మ కోసం చేతులు జోడించి తప్పుకునేవాడు. ఇప్పుడిలా పదినిమిషాలు దేవుడి ముందు కూర్చుని ఏం చేయాలో తోచక... దేవుళ్ళ విగ్రహాలు, పటాలు, ఊదిబత్తి స్టాండు, గంట, కర్పూరం పళ్ళెం, దేవుడి కోసముంచిన నైవేద్యం, అక్కడున్న దేవుళ్ళ చరిత్రలు, శ్లోకాలున్న పుస్తకాలను చూస్తూ కూర్చున్నాడు. శ్రీవల్లివేపు ఓసారి చూశాడు. ఆమె కళ్ళు



మూసుకుని ధ్యానంలో వుంది.

'అమ్మో! ఈవిడ కూడా మీరాబాయికి వార సురాలే!' అని మనసులో అనుకుని భుజలెగరేశాడు.

"రండి!... ఇక లేవండి" అన్న పిలుపుతో ఈ లోకంలోకొచ్చి "హమ్మయ్య, దేవుడికి మా గురించి పరిచయ ప్రార్థన అయిపోయిందా? గ్లాడ్ టూ మీట్ యు స్వామీ" అన్నాడు సుబ్బారావు.

"నీకన్నీ వేళాకోళాలూ నిర్లక్ష్యమూ. ఎలా వేగుతావో ఏమిటోనే అమ్మడూ. అన్నయ్యకు మల్లే వీడిక్కూడా దేవుడంటే నమ్మకం లేదు" అంది మీరాబాయి గొంతు సాగదీసి చేతులూపుతూ, శ్రీవల్లి వేపు జాలిగా చూస్తూ.




"అదేంటక్కా! అలా బావమీద నిందలేస్తావు. దేవుడి ఫోటో కనబడితే చాలు అదేదో సినిమాలో బ్రహ్మానందంలాగా రెచ్చిపోయి పొర్లుదండాలు పెట్టటం ప్రత్యక్షంగా చూస్తేనూ..." అన్నాడు సుబ్బారావు.

"అదేమరి పాతివ్రత్య మహిమంటే. మీ బావగారు కాస్త మారిన మాట నిజమే ననుకో. ఏదో మొక్కుబడిగా చేతులు జోడిస్తారే తప్ప మనస్ఫూర్తిగా ప్రార్థన చెయ్యరు. అదే నా బాధ."

"దానిక్కూడా ఏదైనా వ్రతమో, నోమో, తీర్థయాత్రనో వుంటుంది కదే. తెలుసుకుని చేస్తే పోలా!"

"ఏంట్రా బామ్మర్ది! చేస్తున్న పూజలతో, మడి ఆచారాలతో, మితిమీరిన చాదస్తంతో వేపుకు తింటోంది. అవి చాలక క్రొత్త వ్రతాలు, నోములు అంటూ నేర్పిస్తున్నావు" అంటూ వెంకోజీ ప్రవేశించాడు.







"ఛీ! ఛీ! ఛీ! ఏమిటా రావటం?... ముందు బయటకెళ్ళండి. కాళ్ళు కడుక్కుని ఆవు పంచితం ప్రోక్షించుకు రావాలని ఎన్నిసార్లు చెప్పాను. పదండి పదండి" అంటూ భర్తను తరుముకుంటూ బయటకు పోయింది మీరాబాయి.

"హలో! హలో! శ్రీవల్లిగారూ... ఏమిటా అయోమయం చూపులు. ఈ లోకంలోకి రండి, ఆ వంటింట్లో కెళ్ళి కాస్త కాఫీ కలుపుకు వస్తే తాగి తరిస్తాను" అన్నాడు సుబ్బారావు.

"వంటింట్లోకి అమ్మ తప్ప ఎవ్వరూ వెళ్ళకూడదు మామయ్యా!" అంది మీరాబాయి కూతురు లత.

"అదొకటుందా ఎలా వేగుతున్నారే మీ అమ్మతో" అన్నాడు సుబ్బారావు. **(సశేషం)**

## హాస్యానందం సౌజన్యంతో నిర్వహించబడిన

మళ్ళ జగన్నాథం స్మారక తెలుగు స్కిట్ పోటీలో పాల్గొన్న రచయితందరికీ అభినందనలు! హాస్యానికి పెద్దపీట వేస్తూ రాసిన స్కిట్‌లు అన్నీ బావున్నాయి. వాటిలో కొన్నింటికి మాత్రమే బహు మతులు ఇవ్వగలం కాబట్టి వచ్చిన వాటిలో అన్నివిధాల అర్హమైన వాటిని ఎంచుకుని బహుమతులు ఇవ్వబడ్డాయి.










## తెలుగు కామెడీ స్కిట్‌ల పోటీ ఫలితాలు!

ప్రముఖ కార్టూనిస్ట్ **శ్రీబాలి,** ప్రముఖ సినీనటి **పూర్ణిమ,** గంటలో 654 జోకులు చెప్పి-గిన్నీస్ రికార్డ్ సాధించిన **శ్రీ కోరుకొండ రంగారావులు న్యాయనిర్ణేతలుగా** వ్యవహరించారు.

విజేతలకు మరోసారి అభినందనలు... పాల్గొన్న వారందరికీ ధన్యవాదములు.

**ప్రథమ బహుమతి: డాక్టర్ ఒబేసిటీ**
-శ్రీ మేడా మస్తాన్‌రెడ్డి, విశాఖపట్టణం.

**ద్వితీయ బహుమతి: సుబ్బారావు స్వీట్ హోం**
-శ్రీమంత్రవాది మహేశ్వర్, హైదరాబాద్

**ప్రత్యేక బహుమతులు:**

1. **ఆ ఇద్దరు** -శ్రీ పి.వి.వి.సత్యనారాయణ, హైదరాబాద్
2. **దామిట్ కథ అడ్డం తిరిగింది.** -శ్రీ ఎమ్.ఆర్.వి. సత్యనారాయణ మూర్తి,పెనుగొండ
3. **గుడ్డు మీద గుడ్డు పెట్టు** -శ్రీ కోనే నాగ వెంకటాంజనేయులు, విశాఖపట్టణం
4. **ఉచితం శరణం గచ్ఛామి** - శ్రీమతి పి.వి. శేషారత్నం, హైదరాబాద్
5. **పెళ్ళంటే నూరేళ్ళ వంట** -శ్రీ పారుపూడి వెంకటసత్యనారాయణ, విశాఖపట్టణం

### ప్రథమ బహుమతి

## డాక్టర్ ఒబేసిటీ
### -మేడా మస్తాన్‌రెడ్డి

డాక్టరు తన క్లినిక్‌లో కూర్చుని ఉంటాడు. లావుగా ఉండే ఒకామె జంతికలు నములుతూ లోనికి వస్తుంది.

భారీకాయం:నమస్తే డాక్టరు గారు... నా పేరు సూరేకాంతం.

డాక్టరు : నమస్తే... కూర్చోండి... ఏమిటి ప్రాబ్లం.

సూరే : నా ఒళ్ళు తగ్గాలండి. మంచి మందులివ్వండి.

డాక్టరు : (ఆమె కుడిచేతి నాడి పట్టుకుని పల్స్ చూస్తూ) ఇంతవరకు ఏం తీసుకున్నారు ?

సూరే : ఉదయం కాఫీ, టిఫిను, తర్వాత బోర్నవీటా. ఇప్పుడు ఈ జంతికలు.

డాక్టరు : నేను అడిగింది ఏమైనా ట్రీట్మెంట్ తీసుకున్నారా... అని. తినడం ఆపి చెప్పండి.

సూరే : డాక్టరుగారు.. నేను ఈ నగరంలోని అందరు డాక్టర్ల వద్దకు వెళ్ళాను. ట్రీట్మెంట్ తీసుకున్నాను. కానీ నా ఒళ్ళు మాత్రం తగ్గడం లేదండి.

డాక్టరు : నేను తగ్గిస్తానమ్మా. నాపేరే డాక్టరు ఒబెసిటి. నేనే నెంబర్ వన్ ఇన్ సిటి.

సూరే : ఆ పుణ్యం కట్టుకోండి బాబ.. చచ్చి మీ కడుపున పుడతాను.

డాక్టరు : నేను చావనీయను కదా! ముందు మందులతో కాదు, నా తెలివి తేటలతో మీకు చికిత్స చేస్తాను. సరేనా.. మీ దినచర్య ఏమిటో చెప్పండి.

సూరే : సూరీడు వచ్చిన గంటకు నిద్ర లేస్తాను.

డాక్టరు : సూరీడంటే మీ పనిమనిషా?

సూరే : కాదండీ.. మన ప్రత్యక్ష దైవం. సూర్య భగవానుడు.

డాక్టరు : ఓ! ఆ తరువాత...?

సూరే : బెడ్ కాఫీ తాగుతాను

డాక్టరు : అదే... కాఫీ ఎవరు కలుపుతారు?

సూరే : వంటమనిషి కలుపుతుంది. పనిమనిషి తెచ్చిస్తుంది. నేను తాగుతాను.

డాక్టరు : ఆ తరవాత ?

సూరే : కాలకృత్యాలు తీర్చుకుని టీవీ ముందు కూర్చుని టిఫిన్ తింటాను.

డాక్టరు : అదే...అదే.. ఆ టిఫిన్ ఎవరు చేస్తారు?

సూరే : వంటమనిషి చేస్తుంది.. పనిమనిషి తెస్తుంది... నేను తింటాను.

డాక్టరు : ఆ తరవాత...?

సూరే : మధ్యాహ్నం వరకు టీవీ సీరియళ్ళు చూసి భోజనం చేస్తాను.

డాక్టరు : ఆ భోజనమైనా మీరు చేస్తారా?

సూరే : (విసుగుతో) ఏం మేం ఏమన్నా లేని వాళ్ళమనుకున్నారా ? వంటావిడ చేస్తుంది. భోజనం చేసిన తర్వాత పడుకుంటాను. నిద్రలేచి పకోడి తింటూ టీ తాగాక పక్కింటావిడా నేను పొరుగింటి వాళ్ళను గురించి మాట్లాడుకుంటాం.

డాక్టరు : మరి మీ తోటపని.. అదే మొక్కలకి నీళ్ళు ఎవరు పోస్తారు ?

సూరే : తోటమాలి.

డాక్టరు : ఇంట్లో బట్టలెవరు ఉతుకుతారు?

సూరే : ఉదయాన్నే చాకలి వచ్చి బట్టలు ఉతికి ఆరవేస్తుంది. ఆరిన బట్టల న్నిసాయంత్రం పనిమనిషి మడత పెట్టి అల్మరాలో సర్దుతుంది.

డాక్టరు : సాయంత్రం ఏం చేస్తారు ?

సూరే : రాత్రి వరకు టీవి సీరియల్స్ చూసి, రాత్రికి లైట్‌గా పుల్కాలు తింటాను.

డాక్టరు : (నవ్వుతూ) పిండి పనిమనిషి కలుపుతుంది. పుల్కాలు వంట మనిషి చేస్తుంది. మీరు తింటారు.



ఎన్ని?

సూరే : ఎన్నోకాదండి. పదంటే పదే.. అదీ అన్నం తినేముందు.

డాక్టరు : సూరేకాంతంగారు...నాకు మీ కేసు పూర్తిగా అర్థం అయింది. నేను చెప్పింది చేయండి. ఒళ్ళు తగ్గ కుంటే నన్నడగండి. రేపటినుంచి మీరు వంటమనిషిని, పనిమనిషిని మాన్పించేయండి.

సూరే : వంటమనిషి, పనిమనిషిని మాన్పిం చేస్తే నా ఒళ్ళు తగ్గుతుందా ?

డాక్టరు : తగ్గుతుంది. ఆ తర్వాత చాకలిని, తోటమాలిని మాన్పించేయండి.

సూరే : చాకలిని, తోటమాలిని మాన్పిం చేస్తే... నా ఒళ్ళు తగ్గుతుందా ?

డాక్టరు : తప్పక తగ్గుతుంది. ఫీజు ఇచ్చి వెళ్ళండి... నెల తర్వాత రండి.

(సూరేకాంతం డబ్బిచ్చి ఆనందంతో జంతికలు తింటూ వెళ్ళిపోతుంది)

నెల తరవాత...)

సూరే : (ఆయాస పడుతూ వచ్చి) డాక్టరు గారూ... డాక్టరుగారూ... నా ఒళ్ళు తగ్గలేదు సరికదా ఇంకా పెరిగిం దండీ.

డాక్టరు : నేను చెప్పినట్లు చేశారా? పని వాళ్ళందరినీ మాన్పించేశారా ?

సూరే : అందరినీ మాన్పించేశాను... అయినా నా ఒళ్ళు తగ్గలేదు.

డాక్టరు : (ఆశ్చర్యంగా) అందరినీ మాన్పిం చేసినా మీ ఒళ్ళు తగ్గక పోవడ మేమిటి... వాళ్ళు చేసే పనులు అన్నీ ఈ నెలాళ్ళు మీరే చేస్తే ఖచ్చితంగా మీరు 4 కేజీలు తగ్గాలే.

సూరే : ఆ పనులన్నీ నేనెందుకు చేస్తాను డాక్టరుగారు ! ఏం మేం ఏమన్నా లేని వాళ్ళమనుకున్నారా ?

డాక్టరు : మరైతే ఎవరు చేశారు ?

సూరే : మీరు ఒక్క క్షణం ఆగండి. ఏవం డోయ్.. మీరు ఓసారిలా రండి.

(కళ్ళు చిదంబరం లాంటి ఒక బక్క పలచని వ్యక్తి నీరసంగా వస్తాడు).

సూరే : ఈయనే ఈ నెల రోజులూ అన్ని పనులూ చేశారు. అయినా నా ఒళ్ళు తగ్గలేదండీ.

డాక్టరు : ఇంతకీ ఈయనెవరూ...??

సూరే : మా ఆయన.

డాక్టరు : ఆ...

(స్పృహ తప్పి టేబుల్ మీద వాలి పోతాడు)

## ద్వితీయ బహుమతి

## సుబ్బారావు స్వీట్ హోం

**-శ్రీమంత్రవాది మహేశ్వర్**

సుభద్ర : ష్... ఛి ఛి ఛి...యూజ్‌లెస్... డర్టీ ఫెలోస్....కల్చర్‌లెస్...వాట్ దే థింక్ ఐ డోంట్ నో...

సుబ్బారావు : ఎవరు...ఎవరది(లోపల్నుంచే)

సుభద్ర : అబ్బబ్బ. ఏమిటండీ..ఇక్కడే వుండి గొడవంతా హరికథ వింటున్నట్టు వింటూ కూర్చున్నారా...!

శంకరం : ఏం గొడవ అక్కయ్యా... నేనూ, బావగారూ- ఇదిగో ఈ మాగ జైన్‌లో ఆర్టికల్ బావుందంటూంటే చదవుతున్నాం.

సుభద్ర : అంటే మీకేం వినబడలేదన్నమాట.

శంకరం : ఇంతకీ ఏమైందక్కయ్యా... ఆ చమటలేమిటి...?

సుభద్ర : ఏదో అయిందిలే... మీకేం విన బడలేదంటున్నారుగా ఆటో వాడితో పద్ద ఘర్షణ.

సుబ్బా : అదా... గొడవ వినబడింది. కానీ నువ్వనుకోలేదు.

సుభద్ర : అయ్యబాబోయ్.. దేవుడోయ్...

శంకరం : ఏంటక్కయ్యా

సుభద్ర : అయిపోందిరా... అంతా అయి పోయింది. ఈయనగారి చెవులకు

ఏదో అయిపోయింది.

సుబ్బా : నా చెవులకేమైంది... బ్రహ్మాండంగా పనిజేస్తుంటేనూ... కావాలంటే ఈ పని చేద్దాం...

శంకరం : ఏమిటది బావగారూ?

సుబ్బా : మీ అక్కయ్యగారిని నెమ్మదిగా తిట్ట మను నన్ను... వినిపిస్తుందో లేదో పరీక్షిద్దాం!

శంకరం : పోండి బావగారు మీరు మరీను.. తిట్టమనడమేమిటి... అలా కోరు కుంటారు!

కంతా ఇక్కడ ఇలా వెళ్ళబోస్తోంది.

సుభద్ర : అక్కడ బానే జరిగింది. మీరలాంటి భ్రమలేం పెట్టుకోనక్కర్లేదు.

సుబ్బా : కూల్....కూల్... ముందు ఈ గ్లాసుడు మంచినీళ్ళు త్రాగి స్థిమిత పడు.. ఏదో గొడవ జరుగుతోందని పించింది... నువ్వనుకోలేదు.

సుభద్ర : చూశావురా శంకరం! ఇన్ని సంవ త్సరాలుగా కాపురం చేస్తున్నానే – నా కంఠస్వరాన్ని పోల్చుకోలేక పోయారంటే ఏమనాలి? (బాధ)

సుబ్బా : మరొకరు గొడవపడుతుంటే మధ్యలో 'తల' పెట్టడం నాకిష్ట ముండదు.

సుభద్ర : ఇద్దరు గొడవపడుతుంటే విడిపించే కనీస ప్రయత్నం కూడా చేయరన్న మాట.

శంకరం : లేదు ఫ్రీగా స్టంటు సీను చూసిన ఆనందం పొందుతారు... (వ్యంగ్యంగా) లేకపోతే ఏమిటక్కా నువ్వు ఆ అడగడం?

సుభద్ర : నీకు తెలియదుండరా!

సుబ్బా : ఇదిగో సుభద్రాజీ– ఆటోవాడితో అయింది ఇక నాతో తగాదా పెట్టు



సుబ్బా : మరి లేకపోతే ఏం చేయమంటావు శంకరం! నా చెవులకు అగ్నిపరీ క్షయ్యా బాబూ! నిక్షేపంలాంటి నా చెవుల మీద నిందలేస్తుందా?

సుభద్ర : నువ్వు చెప్పరా! అరగంటనుంచీ వీధి గుమ్మంలో ఆటోవాడితో ఘర్షణ పడుతుంటే కనీసం బయటి కైనా తొంగి చూడకుండా లోపలే వుండి పోయారంటే నేనేమను కోవాలి.

శంకరం : నువ్వు ఏలూరు నుంచి చీకటి పడే వేళకే వస్తానన్నావు కదా?

సుభద్ర : ఏం నేనిలా ముందు రావడం మీకు బాధగా వుందా చెప్పండి!

శంకరం : అక్కా.. (ఏదో అనబోతుంటే)

సుబ్బా : నువ్వు ఊరుకో శంకరం... ఆవిడ గారికి అక్కడ ఫంక్షన్‌లో మర్యాదా అది సరిగా జరిగివుండదు. ఆ చిరా

శంకరం : వద్దు...ఏమనొద్దు గానీ.. విషయ మేమిటో చెప్పు అక్కా!

సుభద్ర : అది తరువాతగానీ ముందు రీజన్ ఏమిటో ఐ వాంట్ టు నో!

సుబ్బా : అదే... అదే తల్లీ నా కొంప ముంచింది... ఆ ఇంగ్లీషే!

సుభద్ర : ఎస్కేప్ అవడానికి ఎత్తులు వేస్తు న్నారా ఐ కాన్...

శంకరం : అక్కయ్య ఒకో రోజున అలా ఇంగ్లీ షులో మాట్లాడేయటం అదీ చేస్తునే వుంటుంది కదా... ఎందుకు పోల్చుకోలేక పోయామంటారు?

సుభద్ర : ఎస్ ఆస్క్ లైక్ దట్.. వాయిస్‌ను గుర్తు పట్టలేదు ఓకే పోనీ గొడవ అవుతోందని తెలుసుగా.. ఏమిటో అని చూడొచ్చుగా..

సుబ్బా : నిజం చెప్పమంటావా?

సుభద్ర : ఆ మాట నన్నడగాలా మళ్ళీ...

కుందామని చూస్తున్నావా...(చిటిక వేసి) ఆ ఆటోవాడితో తగాదాకి ఫ్లాష్‌బ్యాక్ ఏమైవుంటుందో ఊహిం చగలను.

శంకరం : ఎందుకైవుంటుంది బావగారూ...

సుబ్బా : ఆ ఇంగ్లీషులో మాట్లాడటం, కళ్ళకు ఆ అద్దాలు.. భుజానికో బ్యాగు. ఓ రూపాయన్నా ఎక్కువ సంపాదించ వచ్చు ఈ మహా తల్లి దగ్గర అను కుని పాపం ఆశపడి వుంటాడు ఆ ఆటోడ్రైవర్.. శంకరం ఇది బావుండదు సబ్జెక్టుగా... టైటిల్... (ఆలోచిస్తూ) ఆ 'ఆశపడిన ఆటో వాలా' ఈ కథ ఎవరిని ఉద్దేశించి వ్రాసినది కాదు అని కూడా చివర్న చేర్చు...

శంకరం : (నవ్వు)

సుభద్ర : (కొరకొరా చూస్తూంటుంది)

## ప్రత్యేక బహుమతి-1

## ఆ ఇద్దరు

### -పి.వి.వి.సత్యనారాయణ

(పెళ్ళివారి ఇల్లు సందడిగా ఉంది.. ఓ గదిలో ఒకామె ఒంటరిగా అద్దంలో చూసు కుంటూ...)

"అబ్బ నా రూపం నాకే మత్తెక్కిస్తోంది."

(అంతలో మరో ఆమె ఆ గదిలో ప్రవేశి స్తుంది)

మొదటి ఆమె : హాయ్ నా పేరు వరలక్ష్మి, పెళ్ళికూతురి జిగ్రీ దోస్తిని.

రెండవ ఆమె: హాయ్ నా పేరు మోహిని. పెళ్ళికొడుకు గర్ల్ ఫ్రెండ్‌ని.

వరలక్ష్మి : (ఆశ్చర్యంతో) గర్ల్ ఫ్రెండా..!?

మోహిని : ఊ మేం పెళ్ళి కూడా చేసుకో వాలనుకున్నాం

వరలక్ష్మి : (సంభ్రమంతో) మరి... ఇప్పుడు ఈ సంబంధం..!?

మోహిని : (నిట్టూర్పుతుంది) విధి ఆడిన ఆటలో ఓడిపోయాం మేము.

వరలక్ష్మి : కూతురు కమలా, నేను ఎల్కేజి నుండి కాలేజ్ వరకు కలసి చదువుకున్నాం. ఇద్దరమూ ఒకేసారి పెళ్ళి చేసుకోవాలను కున్నాం... ప్చ్! మా కోరిక నెర వేరలేదు.



మోహిని : ఎంచేత ?

వరలక్ష్మి : నేను గీతాసింగ్‌లా బొద్దుగా ఉండేదాన్ని. మొద్దును చూసినట్టు పెళ్ళికొడుకులు బెదిరిపోయే వారు. దాంతో నాకిక పెళ్ళి కాదని డిసైడైపోయారు మా వాళ్ళు.

మోహిని : అయ్యో పాపం!

వరలక్ష్మి : అప్పుడే చూసాను టీవిలో ఆ ప్రకటన.

మోహిని : ఏ ప్రకటన?

వరలక్ష్మి : మీరు చాలా లావుగా ఉన్నారా? ఐతే మా చికిత్సతో నెల రోజుల్లో సన్నబడండి..! అన్న ప్రకటన... వెంటనే పాతికవేలు చెల్లించి చికిత్స ఆరంభించాను.

మోహిని : (కుతూహలంగా) ఫలితం కని పించిందా ?

వరలక్ష్మి : భేషుగ్గా ! వారం తిరక్కుండానే... ఇలా స్లిమ్‌గా తయారయ్యాను.

మోహిని : (విభ్రాంతితో) ఓ మై!

వరలక్ష్మి : నా ఫోటోని నెట్‌లో పెడతాను అది చూసి పెళ్ళికొడుకులు వెర్రెక్కి పోవాలి!

(సెల్ ఫోన్లో తన రూపానిన క్లిక్ చేసుకుం టుంది. ఆ ఫోటోని చూసి ఉలిక్కిపడి, అయో మయంగా)

వరలక్ష్మి : అరే! ఇదేమిటి, నా రూపానికి బదులు...మబ్బులాంటి ఈ ఇమేజ్ ఎక్కణ్ణుంచి వచ్చింది!? సెల్ క్యామ్‌పాడయినట్టుంది.

మోహిని : (నవ్వి) అది కెమెరా తప్పుకాదు, వరం! ప్రేతాత్మలకు కొన్ని హద్దులు ఉంటాయి..!!

## ప్రత్యేక బహుమతి-2

## డామిట్ కథ అడ్డం తిరిగింది.

### -ఎమ్.ఆర్.వి.సత్యనారాయణమూర్తి

(తెరలేచేసరికి గుర్నాథం అటూ, ఇటూ పచార్లు చేస్తుంటాడు)

గుర్నాథం : ప్రొద్దుట్నుంచీ బోణీలేదు. సిగరెట్ కాల్చక 'పళ్ళు టైపు' కొట్టేస్తున్నాయ్.

(ఎడంవైపు నుండి వస్తున్న రాంబాబుని చూడ గానే గుర్నాథం మొహం పవన్‌కళ్యాణ్ సిని మాకి మొదటి రోజే టికెట్టు దొరికినంత ఆనం దంగా వికసించింది.)

గుర్నాథం : హలో రాంబాబు, ఎలా ఉన్నావ్?

రాంబాబు : ఎలా వుంటానండి. ఫైలాన్ తుఫాన్‌లో చిక్కుకున్న రైతులా దారీ, తెన్నూలేకుండా ఉన్నాను. ఉద్యోగం చూసుకోక పోతే మా ఆవిడ పుట్టింటికెళ్ళి పోతానం టోంది.

గుర్నాథం : ముందు సిగరెట్టిలా పడేయ్. నీ సమస్య నేను పరిష్కరిస్తాను.

(రాంబాబు సిగరెట్టు పెట్టె తెరవగానే గుర్నాథం మూడు సిగరెట్లు తీసుకుని రెండు జేబులో వేసుకుని, ఒకటి వెలిగించి గట్టిగా దమ్ములాగి వదుల్తాడు).

గుర్నాథం : రాంబాబు! ఆడవాళ్ళ మాటల కెప్పుడూ అర్థాలు వేరుగా వుం టాయి. పుట్టింటికి వెళ్తాను అంటే, ఇప్పుడేం వెళ్ళను అని గూఢార్థం అన్నమాట.

రాంబాబు : నిజంగా వెళ్ళదంటారా ?

గుర్నాథం : వెళ్ళదు ఈ సిగరెట్టు మీద ఒట్టు. నా థర్డ్ సెన్స్ మీద నాకు నమ్మక మెక్కువ. అది చెబుతోంది మీ ఆవిడ ఎక్కడికి వెళ్ళదు. హాయిగా టి.వి. సీరియల్స్ చూస్తుంది

రాంబాబు : అందరూ సిక్స్ సెన్సు అంటారు. కాని మీరేమో థర్డ్ సెన్సు అం టారు. అయినా మీరన్నీ మూడం కె మీదే చెప్తారు. సిగరెట్లు కూడా మూడు తీసుకున్నారు. ఏంటండీ రహస్య ?

గుర్నాథం : వెర్రివాడా! ఈ సృష్టిలో అన్నీ మూడు సంఖ్య మీదే ఆధారపడి

నడుస్తున్నాయ్. మనకు ప్రధాన మైన దేవుళ్ళని త్రిమూర్తులం టాం. ఇంకొంతమందిని కలుపు కుని చతుర్మూర్తులని, పంచ మూర్తులని అంటామా?

రాంబాబు : అనమండి

గుర్నాధం : పెళ్ళిలో పెళ్ళికూతురు మెళ్ళో పెళ్ళికొడుకు ఎన్ని ముళ్ళు వేస్తాడు ?

రాంబాబు : భలేవారండి మూడు ముళ్ళండి. నేను కూడా తాళికట్టి మా ఆవిడ మెళ్ళో మూడు ముళ్ళు వేసానండి. (సిగ్గు అభినయిస్తూ)

గుర్నాధం : అదీ సంగతి నువ్వు దారిలో పడుతున్నావు. ఎవరి వ్యాపారమై నా బాగుందంటే ఏమంటారు? మూడు పువ్వులు, ఆరు కాయల్లా వుందంటారు. ఏం? నాలుగు పువ్వులు నలభైకాయల్లా వుందని చెప్పరేం ?

రాంబాబు : ఎందుకు చెప్పరంటారు? (ఆశ్చర్యంగా అడుగుతాడు)

గుర్నాధం : ఎందుకంటే మూడు సంఖ్యకున్న గొప్పతనం అది. పరమశివుడు మూడు నామాలు అడ్డంగా పెట్టు కుంటే, వేంకటేశ్వర స్వామి కూడా మూడు నామాలు నిలు వుగా ధరిస్తాడు అవి చూసైనా మనం తెలివిగా నడుచుకోవాలి.

రాంబాబు : అంటే ఇప్పుడు నేను కూడా మూడు నామాలు పెట్టుకోవా లంటారా ?

గుర్నాధం : (స్వగతంగా నువ్వెందుకురా పెట్టుకోవడం నేనున్నానుగా నీకు నామాలు పెట్టడానికి)
(పైకి) అదేం అక్కర్లేదు. రాం బాబు! నేను చెప్పే మూడు ముక్క లు నువ్వు శ్రద్ధగా విని తరించు.

రాంబాబు : అది సరే గురువుగారు! ఈ మూడుసిగరెట్లు కిటుకేమిటండి?

గుర్నాధం : ఇప్పటికి ఒకటి అయిపోయింది. రెండోది ఇంటికెళ్తూ కాల్చు కుంటాను. మూడోది రాత్రి భోజనమయ్యాక డాబామీదకెళ్ళి వెన్నెల్లో చందమామను చూస్తూ సిగరెట్ కాలుస్తూ రింగురింగు లుగా పొగ వదుల్తూ వుంటే భలే మజాగా వుంటుందిలే!

రాంబాబు : వెన్నెల్లో కూర్చుని పెళ్ళాంతో హాయిగా కబుర్లు చెప్పుకోవాలి గాని, సిగరెట్ పొగలో ఏముం టుంది గురువుగారు, దగ్గు తప్పించి.



గుర్నాధం : సరే, ఆ టాపిక్ వదిలేయ్ నేను బిజినెస్ ప్రారంభిద్దామను కుంటున్నానోయ్

రాంబాబు : ఏం బిజినెస్ గురువుగారు?

గుర్నాధం : మారేజ్ బ్యూరో! ప్రస్తుతం లాభ సాటి వ్యాపారం అదేనోయ్ మూడులక్షల మూడువేల రూపా యలు ఇన్వెస్ట్ చేద్దామను కుంటున్నాను ఇద్దరు పార్టనర్స్ కుదిరారు మూడోవ్యక్తి కోసం చూస్తున్నాను. మూడేళ్ళలో మన పెట్టుబడి రావడమేకాదు మూడు రెట్లు లాభం వస్తుంది.

రాంబాబు : నిజంగానా గురువుగారు?

గుర్నాధం : ముమ్మాటికి నిజం నువ్వు పార్టనర్‌గా చేరుతావా?

రాంబాబు : ఉద్యోగమో, వ్యాపారమో ఏదో ఒకటి చెయ్యమని మా ఆవిడ చంపేస్తోంది! అలాగే పార్టనర్‌గా చేరతాను మిగతా ఇద్దరు పార్టనర్స్ ఎవరు సార్ ?

గుర్నాధం : నేను మా ఆవిడా!

రాంబాబు : మీరుంటే నాకెంతో ధైర్యం. నేనెంత పెట్టుబడి పెట్టాలి?

గుర్నాధం : రేపే నీ వాటా మూడు లక్షలు పట్టుకురా. వెంటనే బిజినెస్ ప్రారంభిద్దాం

రాంబాబు : ముగ్గురు పార్టనర్స్ కదాసార్! మీరిద్దరూ రెండు లక్షలు పెడితే నేను లక్ష రూపాయలు ఇస్తే సరి పోతుందిగా !

గుర్నాధం : రాంబాబు, నువ్వు మూడు సంఖ్య గొప్పతనం మర్చిపోతున్నావు, నేను, మా ఆవిడా కలిసి మూడు వేలు పెడుతున్నాం... నువ్వు మూడు లక్షలు పెట్టుబడి పెడితే మన వ్యాపారం మూడు పువ్వు లు, ఆరు కాయల్లా దినదినా భివృద్ధి చెందుతుంది

రాంబాబు : ఏమిటీ మీరు మూడు వేలు పెడితే నేను మూడు లక్షలు పెట్టు బడి పెట్టాలా? అయ్ బాబోయ్ ఈ విషయం తెలిస్తే మా ఆవిడ నన్ను ఉతికి ఆరేస్తుంది. వద్దు బాబు మీ స్నేహం వద్దు మీ వ్యా పారం వద్దు వస్తా!

(అని గబగబా వెళ్ళిపోతాడు)

**ప్రత్యేక బహుమతి-3**

# గుడ్డు మీద గుడ్డు పెట్టు

## -కోనే నాగ వెంకట ఆంజనేయులు

స్టేజ్ డెకరేషన్ పాముల చిత్రాలతో ఉంటుంది. తెర తెరవగానే రాజు పాము డాన్స్ చేస్తుంటాడు. రగులుతోంది మొగలిపొదపాటకి. రవి ప్రవేశం.

రవి : ఏంటి బావా! చాలాహుషారుగా ఉన్నావ్ ఏంటి కథ.

రాజు : ఏంచెప్పమంటావులే బావా (డాన్స్ ఆపడు)

రవి : చెప్పకపోతే ఎలా తెలుస్తుంది. ముందా డాన్సు ఆపు.

రాజు : ఏం చెప్పను బావా! మీ చెల్లి అదే మా ఆవిడ నా పాలిట మహాంకాళి. రోజు రెండు పూటలా గుడ్లతో కొడు తోంది బావా!

రవి : గుడ్లుతోనా? ఎందుకలా? పెళ్ళిలో బంతిలాట ఆడుకోలేదని యిప్పుడా సర్దా యిలా తీర్చుకుంటోందా ఏమిటి?

రాజు : గుడ్లుతో కొట్టడమంటే ఆ కొట్టడం కాదు బావా! ఓపూట గుడ్డుతో ఆమ్లెట్ వేస్తోంది మరో పూట గుడ్డు యిగురు, మరోపూట గుడ్లపులుసు. యింకో పూట గుడ్లతో నా శ్రాద్ధం... నా పిండా కూడు.

రవి : ఓరోరి! దానికింత రాద్ధాంత మెందుకు హాయిగా చప్పరించెయ్యక.

రాజు : చప్పరించేస్తున్నాన్లే మరీ వారం రోజుల్నుంచి గుడ్లేనా? నువ్వు తినగలవా చెప్పు?

రవి : ఆపరాబాబు! ఆ పాము డాన్సేమిటి?

రాజు : ఏమోరా మరి ! వారం రోజుల్నించీ శరీరం మెలికలు తిరిగిపోయి పాము డాన్స చెయ్యకుండా ఉండ లేక పోతున్నాను బావా!

రవి : విచిత్రంగా ఉందే! నాగరాజుని నీకు పెట్టినపేరు సార్ధకంచేసుకుంటు న్నావన్న మాట!

రాజు : నా బొంద కాదు! మెలికలు తిరగ లేక చస్తున్నాను. ఈ మధ్యలో మీ చెల్లి పెట్టే గుడ్లు కూరలొకటి.

రవి : ఎందుకలా చేస్తోంది మా చెల్లి? అయినా తప్పంతా నీదే బావా!

రాజు : నేనేం చేశాను?

రవి : నువ్వు రోజూ బజార్నుంచి గుడ్లు తీసుకురావడమెందుకు? ఆ గుడ్లు మా చెల్లి వండితే తినలేక ఏడవడమెందుకు ?

రాజు : రామ రామ! ఆ గుడ్లు నెనెప్పుడు తెచ్చాను?

(లేచి 'పుట్టలోని నాగన్నా లేచిరావయ్యా! స్వామి పైకి రావయ్య' పాటని డాన్స్ చేస్తాడు మెలి కలు తిరుగుతూ)

రవి : నా ఉద్దేశం మా చెల్లి గుడ్లు పెడు తుందని కాదు బావా! నీకెందుకు పెడుతుందని?... పోనీ తను తింటోందా?

రాజు : అబ్బే తనొక్క గుడ్డు కూడ తినలేదు ఈ వారం రోజుల్లో నాకు తెలిసి. వేరే కురలేవో చేసుకుని తను కమ్మగానే మింగుతోంది.

రవి : ఇదేదో ఆలోచించాల్సిన విషయమే! ఒకవేళ వాళ్ళ నాన్నకి కోళ్ళఫారం ఉందా? కూతురికి డజన్ల కొద్ది గుడ్లు పంపుతున్నాడా ఏమిటి?

రాజు : నీకు తెలుసు కదరా! మా మావది చేపలవ్యాపారం. అవి చేప గుడ్లు కాదు



రవి : యిప్పుడో చిన్న బ్రేక్ లాగా – మధ్య మధ్యలో ఈ స్నేక్ డాన్స్ లేంటిరా?

రాజు : ఏమోరా బావా! ఎంత ఆపుకుందా మన్న ఆపుకోలేకపోతున్నాను.

రవి : విచిత్రంగా ఉందే? నిన్న ఏం కూర తిన్నావేమిటి?

రాజు : యింకావేరే కూరేమిట్రా నీ తల కాయ్! నిన్న మధ్యాహ్నం గుడ్లు పులుసు రాత్రికి మళ్ళీ గుడ్లు వేపుడు.

రవి : ఎందుకిలా గుడ్లు మీద గుడ్లు పెడు తుంది మీ ఆవిడ?

రాజు : మా ఆవిడ గుడ్లు పెట్టడమేమిట్రా? తనే మైనా కోడా?... బాతా?

(అని లేచి 'తన్ డోల్ మేరా మన్ డోలే' పాటకి డాన్సాడుతాడు)

రవి : నీ డాన్సులతో చచ్చిపోతున్నాను రా బాబు! పైగా హిందీలో కూడానా? ఈ మధ్యన 'డాన్స్ బేబి డాన్స్' పోటీ ల్లో పార్టిసిపేట్ చేస్తున్నావా ఏమిటి?

రాజు : నేనా! డాన్స్ ప్రోగ్రాముల్లోనా ! నాకు సరిగ్గా నడవడమే రాదు, యింకా డాన్స్ కూడానా?

రవి : మరి ఈ పాము డాన్స్ లేమిట్రా? ఏదైనా జబ్బేమో డాక్టర్‌కి చూపించు కోలేక పోయావా?

రాజు : తగ్గక పోతే యింక ఆ పనే చేయాలి

రవి : అవునోరే బావా! ఈ మధ్యన మీ యింట్లో ఏమైనా వింతలు గాని, విచిత్రాలు గానీ జరిగాయా? బాగా ఆలోచించుకుని చెప్పు?

రాజు : విచిత్రాలంటే! మొన్న ఒక రోజున మీ చెల్లి... అదే మా ఆవిడ నన్ను 'ఏమండీ' అని ఎంతో ప్రేమగా, మర్యాదగా పిలిచిందిరా బావా!

రవి : (షాక్ తిన్నట్టు) అలాగా! నిజంగానే విచిత్రమే. మీ పెళ్ళయిన దగ్గర్నుంచి చూస్తున్నాను మా చెల్లి నిన్నంత ప్రేమగా పిలవగా విన్లేదు. ఎందుకలా పిలిచింది.

రాజు : ఎందుకేమిట్రా! పండక్కి పట్టుచీర కొనమని టెండరు !

రవి : అదీ సంగతి అందుకే ప్రేమగా ఆ ఆమ్లెట్లు, గుడ్డు కూరలు పెట్టడం!

రాజు : నా బొంద కదూ! వెగటు పుట్టేస్తుంటే ఏడుపొచ్చేస్తోందిరా తినలేక.

రవి : సరే బాగా జ్ఞాపకం చేసుకొని చెప్పు ఇంకేమైనా విశేషాలు జరిగాయా!

రాజు : వారం రోజుల క్రింద ఊరంతా చెడ తిరిగి వచ్చి కాళ్ళు నెప్పులంటే – రాత్రి రెండు గంటల వరకు కాళ్ళు పిసికిందిరా మీ చెల్లి.

రవి : అదిరా పతివ్రతల లక్షణమంటే ...

(ఇంకా నయం పీక నొక్కలేదు – స్వగతం)

రాజు : ఏమంటున్నావ్ బావా స్వగతంలో...

రవి : ఏం లేదు బావా! మళ్ళీ దేనికైనా టెండర్ పెట్టిందా? అని అడుగుతున్నాను.

రాజు : అవున్రాబాబు! బజారు కెళ్ళి షాపింగ్ చేసుకోవడానికి మోపెడ్ కావాలట. బావా చాలా సేపయింది ఉండు

(అని లేచి మరో పాముపాటకి డాన్స్ చేస్తాడు)

రవి : (తల పట్టుకుని కూర్చుంటాడు) యింకా ఆలోచించు బావా! వింతలు విశేషాలు

రాజు : ఆ జ్ఞాపకం వచ్చిందిరా బావా! ఆ మధ్య మా అమ్మా, నాన్న ఊర్నించి వస్తే వాళ్ళని ఏంత మర్యాదగా చూసిందో తెలుసా?

రవి : నిజమా! అత్త మామల్ని గౌరవంగా, మర్యాదగా చూడ్డమా! నిజంగా విచిత్రమే

రాజు : తరువాత తెలిసింది దానికి కారణం! రిటైరైతే పన్నెండు లక్షలొచ్చాయ్ ఆఫీస్ నుండి. ఓ లక్ష యిస్తే డైమెండ్ గాజులు కొనుక్కుంటుందట అదీ సంగతి.

రవి : ఇచ్చేయమను మీనాన్నని. యింకా...యింకా.. ఏమైనా వింతలు ఆలోచించు!

రాజు : యింకానా! యిది వింత విషయమో కాదో తెలియదు కాని బావా! వారం రోజుల క్రితం మా పెరట్లో పాత సామాన్ల పాక ఉంది కదా !

రవి : ఉంటే...?

రాజు : దాన్ని శుభ్రం చేయిద్దామని పనోళ్ళని పెడితే అందులో నాలుగు పాములు అందులోను నాగుపాములు కనిపించాయిరా!

రవి : బాబోయ్ నాలుగు నాగుపాములే ఏం చేశారాపాముల్ని?

రాజు : ఆ పనోళ్ళు కర్రలతో కొట్టి చంపేశారులే !

రవి : హమ్మయ్యా! అయితే ఆగాగు ఏదో లింకు దొరుకుతున్నట్లుంది వారం రోజుల్నుంచి గుడ్లు తిన్న తరువాతే నా నీకు పాము డాన్స్ చేయాలని పిస్తోంది.

రాజు : నువ్వు చెబుతుంటే జ్ఞాపకం వస్తోంది బావా! కరెక్ట్‌గా ఆ గుడ్లు తిన్న రోజు నుండే అరగంటకోసారి పాము డాన్స్ చేయాలనిపిస్తోంది.

రవి : యింకేం! పిక్చర్ క్లియర్‌గ ఉంది పాములు చచ్చిపోయిన తరువాత పాకలో వాటి తాలుకు గుడ్లు డజన్ల కొద్ది దొరికాయి మీ ఆవిడకి. వాటిని వృధా పోనివ్వకుండా నీకు మాత్రం ఆమ్లెట్లు, కూరలు చేసి పెడుతోంది మీ ఆవిడ. అందుకే ఆ పాము డాన్స్‌లు... నీకు పాము లక్షణాలొచ్చేశాయి. కాసేపు వుంటే నన్ను కాటు వేసినా వేస్తావ్ నేను పారిపోతున్నాను

(రాజు లేచి పాము డాన్స్ చేస్తుండగా తెర పడుతుంది).

**ప్రత్యేక బహుమతి–4**

## ఉచితం శరణం గచ్ఛామి

### –శ్రీమతి పి.వి. శేషారత్నం

సుబ్రమణ్యం : ఆండాళూ! కోటీ దగ్గర ఫ్రీఫ్రీ కొత్త బట్టల షాపులో ఒక డ్రెస్సు కొంటే ఇంకోటి ఫ్రీ అట. బాబిగాడికి కొందాం. పద

ఆండాళ్ : (నిట్టూరుస్తూ) అదీ అసలు సంగతి. ఉచితం అంటే మాత్రం ఆమడ దూరమైనా పరిగెడతారు. అదేదో సబ్బు కొంటే గోధుమపిండి ఫ్రీ అంటూ తెచ్చారు. ముక్కిపోయిన పిండి తినలేక చచ్చే చావయ్యిందా? పోనీ ఆ సబ్బేనా బావుందా అంటే ఓ వాసనా లేదు. ఉచితం పిచ్చి కాదుగానీ కాఫీ పొడి కొంటే స్టీలు గ్లాసు ఫ్రీ... కొబ్బరినూనె కొంటే దువ్వెన ఫ్రీ.. ఒక దుప్పటి కొంటే టవల్ ఫ్రీ.అని నాణ్యం లేని వస్తువులతో ఇల్లు నింపేస్తున్నారు.

సుబ్ర : ఆండాళూ! అసలు నాలా ఎవరయినా పుట్టిన్రోజుకి పెళ్లానికి రెండు చీరలు కొనే వాళ్లుంటే చెప్పు. ఛాలెంజ్!

ఆండాళ్ : మొన్నా ఇలాగే ఒక చీర కొంటే ఇంకోటి ఫ్రీ అంటేనేగా కొన్నారు. ఒకసారి కట్టుకుని నీళ్లల్లో పెట్టే సరికి రంగు ఊరిపోయి తక్కిన బట్టలు కూడా పాడయ్యాయా లేదా? మొన్నటికి మొన్న... పండక్కి 'గౌనేం చేసుకుంటా మండీ మనకున్నది అబ్బాయి కదా'...అని నేనెంత మొత్తుకున్నా విన్నారా? మీరుకొన్న ఆ డ్రస్సుకి ఓ కాలు పొడుగు, ఓ చెయ్యి పొట్టీ అయిపోయి... వేసుకోనని

బాబిగాడు మారాం చేస్తున్నాడు. అసలు మనకి గౌనెందుకు చెప్పండి.

సుబ్ర : ఉండనీవోయ్! ఏ పిల్ల పుట్టిన్రో జుకి అయినా బహుమతిగా పట్టు కెళ్లి ఉచితంగా ఇంటిల్లిపాదిమీ విందు భోజనం చెయ్యొచ్చు. చూసావా ఒకటికి రెండుఉచితం. వాళ్లిచ్చే 'రిటర్న్ గిఫ్ట్' ని ఇంకొ కరికి ఇస్తాం.

ఆండాళ్ : నాకు మాత్రం తల కొట్టేసి నట్టుంటోంది. ఇకపెళ్లికి ఇంకో పెళ్లి ఉచితం అంటే నాకు సవి తిని కూడా తెచ్చిపెడతారు తప్ప మీ ధోరణి మాత్రం మార్చు కోరు.

**(పాశ్చాత్య సంగీతం)**

ఆండాళ్ : అబ్బ! ఎన్నాళ్లకీ హోటల్ కొచ్చామో... అబ్బ!... ఈ ఫామిలీ ఏ/సి రూం ఎంత బావుందో?

సుబ్ర : (రహస్యంగా) ఆండాళూ...కొత్తగా తెరిచిన ఈ హోటల్ 'ఉచిత' లో దసరా పండగ సందర్భంగా ఒక భోజనానికి అయితే ఒక పిజ్జా.. ఒక టిఫిన్ తింటే ఐస్క్రీం ఉచి తంగా ఇస్తున్నారట.

బాబు : అమ్మా!ఇదిగో ఇవి నాన్న 'ఉచితా ఉచితా' గోధుమపిండి కొంటే ఇచ్చిన గ్లాసుల్లాగే ఉన్నాయి కదే!

సుబ్ర : ఉష్ అలా గట్టిగా అరవకు.

బాబు : అమ్మా ఐస్క్రీం ఎప్పుడు ఫ్రీగా ఇస్తారే...భోజనం తిన్నాకనా? ముందా? నాన్నా ఆరగంట యింది. పిజ్జా ఎప్పుడొస్తుంది. అదిగో వచ్చేసింది. నాన్నా అబ్బో! మీల్స్, దోశ, పిజ్జా, ఐస్ క్రీం... నాన్నా మనలో ఎవరు పిజ్జా తీసుకోవాలి...ఎవరు ఐస్ క్రీం తినాలి...

సుబ్ర : ఉష్... నువ్వు దోశ తిను.

బాబు : నాకు దోశ వద్దు నాన్నా! పిజ్జా, ఐస్క్రీం కావాలి

ఆండాళ్ : ఏమండీ వెయిటర్ మీరలా




అన్నింటీనీ మూడు భాగాలు చేస్తోంటే అదోలా చూస్తున్నా డండీ...

సుబ్ర : చూస్తే చూడనీ మన ఇష్టం వచ్చి నట్టు మనం తింటాం.

ఆండాళ్ : ఒరేయ్ బాబీ! ఆ పిజ్జా, ఐస్ క్రీంలని అలా నాక్కుంటూ తిన కురా! ఏమండీ ... ఇంకో పిజ్జా ఐస్క్రీం తెప్పించకూడదూ!

సుబ్ర : చాల్లే ఊరుకో... అవి ఉచితంగా కావాలంటే మరో భోజనం, మరో దోశ ఆర్డర్ చెయ్యాలి. మనం తినగలమా?

బాబు : నేను తినగలను నాన్నా! అమ్మా ఇంకా ఆకలేస్తోందే?

సుబ్ర : అపుడే పిజ్జా, ఐస్క్రీం సరదా అయిపోయిందా? నాకు తెలుసు రా... అందుకే ఇదిగో భోజనం లోంచి తీసి ఈ స్వీట్లు, పూరీలు పక్కన పెట్టాను చూసావా!

బాబు : నాన్నా ఇవి ఫ్రీయేనా...

ఆండాళ్ : ఉష్ అయ్యయ్యో అలా జేబుల నిండా మొత్తం సోంపును నింపు కోకురా బాబీ...వీడికి ఆకలి తీర లేదో ఏమిటో చేతులు కడుక్కో వడానికి తెచ్చిన గ్లాసు బౌల్స్లోని గోరువెచ్చని నీళ్ళలో ఈ చిన్న నిమ్మకాయ డిప్పల్ని పిండేసుకుని పటికబెల్లం ముక్కలు కలిపేసు కుని ఎలా తాగేస్తున్నాడో ? మన వెనక ఎవరో కిసుక్కున నవ్వు తున్నార్రా బాబీ...

సుబ్ర : తాగనిద్దూ. ఇదిగో వెయిటర్! ఒక దోశ, ఒక భోజనానికి రెండు వందలపాతిక కదా! ఎనిమిది వందల పాతిక బిల్లు వేసారు! బిల్లు కరెక్టు చేయించుకు రా!

వెయిటర్ : హిహిహి బిల్లు కరెక్టే సార్! దోశ

పాతిక... భోజనం రెండు వందలు.. కాని మీరు భోజనం లో రెండుసార్లు వేయించుకున్న ఎక్స్‌ట్రా పూరీలకు యాభై.. ప్లస్‌యాభై....ఇది ఫామిలి రూం కదా.. అందుకని ఎక్స్‌ట్రా నూట యాభై... ఏసిఛార్జెస్ ఎక్స్‌ట్రా వంద. స్పెషల్ డెకరేటెడ్ టేబుల్‌కి ఎక్స్‌ట్రా రెండువందలు... సోంపు రెండు బౌల్స్.. యాభై... మొత్తం ఎనిమిదివందల పాతిక.

ఆండాళ్ : ఏవండీ అందరూ మనకేసి వింత గా చూస్తున్నారండీ.. బిల్లు ఇచ్చే య్యండీ.

సుబ్ర : (చిరాకుగా) సరేలే రెండు ఫైవ్ హండ్రెడ్ నోట్లు... బిల్లు తీసు కెళ్ళు... పదవే పోదాం.

బాబు : (గట్టిగా అరిచాడు) నాన్నోయ్... మన టేబుల్ దగ్గర నువ్వు అక్కడ ప్లేటులో మూడు యాభై నోట్లు మరిచిపోయావు

ఆండాళ్ : ఉష్.. దానిని టిప్పు అంటారని సుందరి ఆంటీ చెప్పింది మర్చి పోయావా ?

వెయిటర్ : (ముసిముసిగా) ఫరవాలేదమ్మా! బాబును అప్పుడప్పుడు మా హెూటల్‌కి తీసుకు వస్తూండండి. అన్ని తెలుస్తాయి.

నమస్తే సార్! మేడమ్.. ఆదా బర్సే... బాబు.. గుడ్ నైట్...

సుబ్ర : మళ్లీ వీడి ఇకిలింపులకీ టిప్పు ఇవ్వాలి కాబోలు.. నీ బ్యాగులో ఓ యాభై ఉంటే పారేయ్!

బాబు : (రహస్యంగా నవ్వుతూ) అమ్మా నాన్న మారిపోతున్నాడే...

ఆండాళ్ : (రహస్యంగా) మారక తప్ప దురా... నీ ముచ్చట తీర్చడం కోసం ఇదంతా సుందరి ఆంటీ వేసిన ప్లాను నాకు ముందే చెప్పిందిలే. 'ఇక్కడ అసలు' మాత్రమే ఉచితం...కొసరంతా ఖరీదని... మొన్న వాళ్ళు ఉచిత హెూటలుకే వచ్చారట.

**ప్రత్యేక బహుమతి-5**

# పెళ్ళంటే నూరేళ్ళ వంట

## -శ్రీ పారుపూడి వెంకటసత్యనారాయణ

బామ్మ : పెళ్ళిచూపులకి మగ పెళ్ళి వారొచేసారే సుబ్బులూ! బాబు బ్రహ్మానందం.. ఇలా కూర్చో నాయనా! రావమ్మ విశాలాక్షి!

విశాలాక్షి: ఏరా బ్రహ్మం! చీరలో పెళ్లికూతురు వరూధినిలా ఉంది కదరా...సరిగ్గా చూడు మరి!

బ్రహ్మ : (ఆత్రుతుగా) అమ్మా!ఆ సంగతి తర్వాత! ముందు వంటల విషయం అడుగు!

బామ్మ : ఈ బొబ్బట్లు కజ్జికాయలూ మా సుబ్బులే చేసింది నాయనా! దాని పాకశాస్త్ర ప్రావీణ్యాన్ని రుచి చూడండి మరి!

బ్రహ్మ : నా కిష్టమైన బొబ్బట్లు అద్భుతంగా కుదరాయి! ఇదిగో సుబ్బలక్ష్మీ గారూ!పూర్ణంలో పాళ్లెన్ని వేసారు?

బామ్మ :సుబ్బులూ... పూర్ణమంటే బొబ్బట్లు లోపలిది మర్చిపోయావా?

సుబ్బులు: లేదులే బామ్మా... ఒకటికి రెండు వేసానండీ!

బ్రహ్మ : (సంబరంగా) అద్భుతం. సరే ఇంకో ప్రశ్న...మీకు వంకాయ...?

సుబ్బులు: వంకాయ కొత్తిమీర పచ్చిమిరప కాయ...మెంతికారంకూరి వంకా య పళంగా ఓ రకం...జీలకర్ర కారం కూరి... ఇంకోరకంచెయ్య గలను. అరటి దూట కూర, పనస పొట్టు కూర అదిరిపోవాలంటే సన్న సన్నగా తరిగి పులుసు, ఆవ పెట్టి.

బ్రహ్మ (మురిసిపోతూ) అబ్బో ఇంక చాలు! అమ్మా ముహూర్తాలు పెట్టించెయ్...

విశాలాక్షి: వెర్రినాగన్నకి బొబ్బట్లని ఎర్రగా పెళ్లాంచేత కాల్పించుకుని ఎప్పుడె ప్పుడు తిందామా అని ఒకటే సరదా!

బామ్మ : ఈ శుభ సమయంలో నిన్ను దీవిం చేస్తున్నానయ్యా... పెళ్లంటే నూరేళ్ల వంట నాయనా!

(అందరూ నవ్వులు)

✦ ✦ ✦

బ్రహ్మ : హమ్మయ్య...చుట్టాలు కదిలారు....

సుబ్బులు: ఏమండీ! మా అత్తయ్య... మీరే వంటలన్నీ చేస్తున్నారని కని పెట్టే సిందండీ! అయినా మీకు తెలిస్తే బావుండదని పొద్దుటే మెలకువ వచ్చినా లేచేది కాదుట... 'ఎంత అదృష్టవంతురాలివే సుబ్బులూ'



